# GADYARATNĀVALI

# గద్యరత్నావళి.

## PROSE SELECTIONS

---


EDITED BY

Mr. B. L. N. SOMAYAJULU.



రాజమహేంద్రవరము

యమ్. సుబ్బారావుచేఁ

[illegible].

---

PRINTED AT RAZAN ELECTRIC PRESS, RAJAHMUNDRY.

1934




*Price As. 10*

# వచననైషధము.

## ఉత్తరభాగము.

అక్కాలంబునం గలిపురుషుఁడు ద్వాపరసంయుతుం డై భూలోకంబున కేతెంచుచుండ నింద్రాదులు వికృతయానంబుతో దుఃఖితతరంబుగ వచ్చుచున్న యాతని నాలోకించి యాతనియాటోపంబుఁ జూడ నెద్దియేని మహోద్దేశంబున నేగుచుండె నని తోఁచెడు నని యాతనిం జెంగటికిం జేరం జీరి యిట్లనిరి.

"ఓకలినాయకా! పైబట్ట జాఱుటయు నెఱుంగక యెదురైనవారిం బలుకరింపక యతిత్వరం బోవు చుంటివి. ఎందులకెకార్యంబున కరిగెదవు?" అనఁ "గుండినంబున దమయంతీస్వయంవర మఁట! ఇవ్వార్త మీకును శ్రుతివిషయంబై యుండవచ్చు. అక్కన్నియ నన్ను వరించు నని పోవు చుంటి. ఇందు మసలినచోఁ గార్యం బతీతం బగు నని గయంబున నేగుచుంటిని. మీ రెం దేగితిరి? ఏవ్యాపారంబు నిర్వర్తించి వచ్చుచుంటిరి?" అన నద్దివిజులు నవ్వి లోలోన నీయాకారంబుం

జూచిన దమయంతి మూర్ఛం గొనదే? "మహాగజాః పలాయంతే మశకానాం తు కా గతి" యనురీతి గాఁ గుసుమచాపునిం గ్రేణి సేయుచూ పొడ వినవార లెల్లం దలలు వాంచి పోవు చుండ నీతని వరించు నఁట! ఎల్లవారికిం దాము గుణగరిష్ఠుల మనుతలంపు గలిగి యుండు గాఁబోలు నని తలపోయుచు ని ట్లనిరి. "అన్నన్నా! మించఁ జేసి వచ్చితివి గదా! అయ్యన్యుమిన్న యన్యుల పయిం గ న్నైన సోఁక నీక గుణగ్రాహిణి గావున లోకైకమాన్యగుణుం డగు నలభూకాంతుం గాంతుఁ గాఁ జేసికొనియె. మేము నుత్సవదిదృక్షచేనేగి యుద్వాహోత్సవా నంతరమున వచ్చు చుంటిమి. ఇంకం బై కేగ నేమిప్రయోజనంబు గలదు? మరలు" మనం బ్రతప్తం బగు నాజ్యంబున నంబుకణంబులు చిమ్మిన చాడ్పునం జిఱ్ఱునఁ గోపించి రధనచ్ఛదంబు కంపింపం బటపట పండ్లు గొఱుకుచు ముక్కు చెఱమ లదరఁ గన్నుల నిప్పులు రాల హు మ్మని "యివ్వారారోహ యెంతటి గొంటుతనంబు గలది! బళీబళీ! కానిమ్ము. మించిన దేమి? ఇల్లలికినం బండువ యయ్యె నే? ఇన్నలదమయంతులకు రాజ్యభ్రంశంబును బంధుదూరంబును వనవాసక్లేశంబునుం బరస్పరవియోగదుఃఖంబును నొనర్చి యేఁచ వలసిన తెఱంగుల నెల్ల నేఁచెద. ఇట్టిపనుల నన్ను మీఱినవార లీజగంబునం గల రే? చూడుఁడు నాప్రజ్ఞ" యని ప్రతిజ్ఞ యొనర్చి "యోద్వాపరా! ఇన్నలుఁం డక్షద్యూతం బన్న నన్నపానాదుల నైనం గొనఁడు. కావున సమయంబు వేచి జూడం

బున న వాని మోస పుత్త్రము. విధానాంతరంబున లోఁబడు
వాఁడు కాఁడు. నీ వడ్డసాళ్ళులం జొచ్చి యాతనియొద్దు గెలువ
కాండఁ బాశకముల దొరల నీకుండుము. నేనును రంధ్రం బా
లోచించి యాతనిం దూలించెద'' నని యాతనిం బుచ్చి నలు
వెంబడించి తిరుగుచు నెద్ది యేని ననాచారం బొదవిన నాతని
యందుఁ బ్రవేశింత మని తలంచుచుం జిరకాలంబు గడపె.
ఆనైషధుండు విధిపూర్వకంబుగా వేదపాఠం బొనర్చుచు
హోమంబుల దేవతలను శ్రాద్ధంబులచేఁ బితృదేవతలను నన్నదా
నంబున మనుష్యులను బలివిధానంబున భూతంబులను దృప్తి
సేయుచు యథాకాలంబుగ సంధ్యావందనాది నిత్యకర్మంబు
లును దర్శపూర్ణమాసాది నైమిత్తికంబులునుం బ్రాయశ్చిత్తంబు
కొరయ కుండ నొనరించుచుం దత్తదవసరంబుల నధ్వర్యు
ప్రముఖులకుం గోరికకు మీఱిన విత్తంబుల మొత్తంబు లొసం
గుచు ధర్మార్థకామంబులు దత్తదుచితంబుగఁ బరస్పరవిరుద్ధం
బులు గా కుండ జరుపుచు నించు కేని ననాచారంబు దొరల
కుండఁ జిరకాలంబు గడపె. అ ట్లుండి యుండి నలుం డొక్క
నాఁడు ప్రస్రావవిసర్జనం బొనరించి పాదంబులు గడుగుట మఱచి
సంధ్యానుష్ఠానం బొనరించె. ఎవ్వఁ డేని దయ్యంబు త్రిప్పులం
బడనివాఁడుం గలఁడె? దైవనియోగం బట్లుండ నాతని నే మన
వచ్చు! ఇంతకాలంబునుం దెలివి గలవాఁడును నేఁడు తద్రహి
తుండు నయ్యె నే? తదనుపదంబున న ఛిద్రాన్వేషణ తత్పరుం
డై వెనువెంటం దిరుగు చున్నకలి యశుచియై యున్నయా

భూపతియం దావేశించుట కిదియె తగినయవసరం బని సంత
సించుచు మదుద్దిష్టంబు సాగింతు నని యాతని నావేశించి
యతనిమనం బించుక దుష్ప్రవృత్తులం జొన్పు చుండి పుష్క
రుం డను భూపతిచెంత కేగి "యోరాజన్యా! నేఁ గలిపురు
షుండ. నాకు నీయందు స్నేహంబొనగూడె. నిన్ను మహైశ్వర్య
సమృద్ధుం జేయ నిచ్చ జనించెం గావునఁ గితవుఁడవై నైషధుం
జూదంబునకుం బిలిచిన నాతండు జూదరియు శౌర్యవం
తుఁడు నగుట నీతోఁ బగడసాలకుం బ్రారంభించును వాని
యైశ్వర్యం బెల్ల గెలిపించుట కై యటుపై నే నుందు" నని
తానొకవిప్రవేషం బూని పాచికలం జేఁ బూని పుష్కరునితోఁ
గూడి నలునిచెంతకు నాతనియభాగ్యదేవత యనం బని యిట్ల
నియె. "నిషధనాథా! నీవు జూదంబునం బ్రవీణుండ వని మా
పుష్కరభూనాయకుండు నీతో నక్షంబులం
గొంత ప్రొద్దు క్రీడింపం దలంచెం గావున ర"మ్మనిన నాతం
డి ట్లని చింతించె. శౌర్యవంతుం డగువాఁడు ద్యూతం
బునకు దురంబునకు నాహూతుం డై యోహటించుట యుచి
తంబు గాదు, సర్వస్వమ్ముం బోయినఁ బో నిమ్ము. ధనహానిక
సహింప వచ్చుం గాని మానహానికి నోర్చుట దుష్కరంబు.
విత్తమెల్లం జెడు నని తలంతు నేని నా కేల జయం బొన
గూడ రాదు? అని యెంచి శారిఫలంబు సాఁచి నాగెలం దమ
రించి లక్షధనంబు నీవి గా నొడ్డి యక్షంబులం జిమ్మ చుండ
నందుఁ గల ద్వాపరునిసామర్థ్యంబున నతనికి నిష్టంబుగ దొరలక

పుష్కరునికిం బెద్దపందెంబు గాఁ దూలం దొడంగె. అట్లు మొదటియొడ్డొడిన మరల యావద్విత్తంబు నొడ్డి తెంపున నాడుచుం జెళ్ళుచెళ్ళునం బాచికలు దూలించి, అదిగో బార. ఇదిగో సత. ఏది చక్కపగడ. ఒకదచ్చితో నుండె. సత యన్న నాకాయ పండును. తీవంచ పడిన లడ్డక్కను. నా జోకు తరలించెద. నీకాయ చంపెద. అని యీరీతి మచ్చరంబు పెచ్చు పెరుఁగ నిరువురును వెనుతీయక యాడు చుండు నంత మరల నలుం డోడె. ఇట్లోడినకొలందిని ముందొడ్డెనం గెలువకుండు నే యనునాశయు దురాగ్రహంబుం బురికొల్పి రాజ్యంబునుం దానికి సంబంధించిన యావదంగంబులు నొడ్డి దైవమా యీసారి తేల్చినం దేల్పుము ముంచిన ముంపుమని గట్టిగఁ బాశకంబులా దొరలించుచు నతిజాగరూకుం డై సారెలఁ గచ్చుచుండె అల్పసంఖ్యఁ బాచికలు దిరుగు చుండ నెంత కచ్చిన నేమి? దైవానుకూల్యంబు తప్పినజోఁ బురుషయత్నంబు ఫలదాయకంబు గాదు గద! అత్తఱిం బురోహితులు, హితులు, నమాత్యులు నానలభూపాలుంజేరంజని "ఓమహారాజా! ద్యూతం బువలన మోసంబుచేకూఱును, తొల్లిటినుండియుంజెప్పిన వినవైతివి. ఇప్పు డైన నుడుగుట మేలు. తొల్లి యనేకు లీజూదంబునం జెడిరి వ్యసనంబులు నీయట్టిపరిజ్ఞాతం జలింపఁ జేయు నే? సర్వస్వనిర్మూలనం బొనర్చు నేని నుత్తమకార్యముం గూడఁ జేయ వల దని పెద్దలు వక్కాణింతురు. అయిన నిందు నీకు గెల్పల వడుట దుర్లభంబు. ఇది యేదో దుష్టగ్రహాగ్రహణాగ్రహంబు

ని న్నిట్లు ప్రేరించు చున్నది. మానవులకులయం దనాదరం బెన్నఁడుం జేయనివాఁడ విట్టివిపరీతవ్యాపారంబుఁ జేకొంట నాయ మగు నే? ఎంతటివాని కైనం బట్టు విడుపు లుండం బోలును.” అనినం గలిసమావేశవివశహృదయుం డగుట నా నలుండు వారిమాటలం బెడచెవులం బెట్టె. అప్పుడు తత్పురంధ్రీరత్నంబు తనభర్త యుప్పగిదిం బెచ్చు పెరుఁగుచున్న యీర్ష్యచే వారిమాటలఁ జెవుల సోఁకింపక తదేకాయత్తుం డై యున్నం జూచి యక్షంబులు పుష్కరునివైపున దొరలుచుం దనసామివైపునఁ బెఱతెఱంగున నున్నం జూచి ‘యహహా! ఎల్లవారికి నీతులం గఱపునీతని కిట్టిదురాగ్రహంబు సంఘటిల్లె. ఆహాహా! దైవవిచేష్టితంబునకు సాధ్యము గాని యది యుం గలదే? మన మేమి చేయ వచ్చు? మనలం గష్టంబులఁ గుడువుఁ డని విధి వ్రాసె. ఈపసిపిల్లలం గూడ నెట్లు బాధింప వచ్చు’ నని మగనియానతిం గొని పురోహితామాత్యాదుల కెఱింగించి యింద్రసేనుం డనుకొమరు నింద్రసేన యనం బరఁగుకొమారి నొక్కతేరిపై నిడి వార్ష్ణేయుం డనుసారథికి దిట్టంబు చేసి యొప్పగించి వీరిం జేకొని విదర్భానగరంబున మన్మాతాపిత్రాదులయొద్ద నునిచి ర మ్మని పుచ్చె. అన్నలుండు మరల నొడ్డి యొడ్డంతయు నోడి ధృతవస్త్రమాత్రశేషుం డై లజ్జాభారంబున నమ్రం బైన యుత్తమాంగంబు నెత్తం జాలక ద్వితీయాద్వితీయుం డై వనంబున కేగు చుండె. అయ్యెడం గల ప్రకృతిజనంబు లెల్ల నాదంపతులం జూచి “అహహా! ఎట్టివారి కెట్టి

దశ వచ్చెను! కలనైన నిట్టిదురవస్థకుం బాత్రాదు రని యెఱుంగుదు మే! ఎట్టివానికైన నెల్లకాలంబు నొకరీతిం గడప శక్యం బె! ఐశ్వర్యంబున నున్నయెడ నెల్లకాలంబు నిత్తెఱంగున నుందు మనుకొన వచ్చునే? శుక్లపక్షంబున నున్న వెన్నెల కృష్ణపక్షంబున నుండదు కదా! చిన్ననాఁటంగోలె యసూర్యంపశ్య యగు నీభీమభూపాత్మజ కాఱడవి నెట్లు సంచరించును? మన సర్వద్రవ్యంబులుం బుష్కరున కొసంగి రాజ్యంబుం గొని మరల నలున కొసంగుద మే" యని బాష్పకలితనయను లై తమ్ము వీక్షించు చుండ వారల నూరడించుచు నూరు వెడలి యచ్చేరువ మూఁ డహోరాత్రంబు లుండం దాత్కాలిక భూనాథుం డగు పుష్కరునిశాసనంబునకు వెఱచి యొక్కరుం డైన నేకాంతంబున నైన నిశీథసమయంబున నైన నలుపాలి కేగకకలిసమావేశంబున నూర కుండిరి. అహాహా! మహారాజ కిరీటమణిరంజితచరణారవిందుం డగు నాతనిచెంతకుం బౌరజనులలో నొక్కరుం డైన వచ్చి యాదరింప కుండుట యెంత చిత్రము! దయ్యంబునకు దయాలేశంబును గలుగదు.

అమ్మూఁడుప్రొద్దులను వారికి వారియె యాహారం బగుట నాఁకంటిచే దురసిల్లుచు నెం దేని నింతయెర నీశ్వరుం డొసంగఁ దే యని దెస లారయు చుండ బంగరుఱెక్కలం బొలుచునొకఖగయుగంబు తనకట్టెదుట నిలిచినం జూచి వానిఁ బట్టంగ సమకట్టి తనపై బట్ట వానిపై వైచిన నాపుట్టంబుం గొంచు గగనంబున కెగసి పకపక నగుచు నప్పతత్త్రిద్వంద్వంబు

వస్త్రశూన్యుం డై వెలవెలఁ బోవుచుం జేయునది లేక
త మ్మారయుచున్న యానలుం జూచి "యోరాజోత్తమా!
స్వకర్మఫలంబులు మాఱుత్రోవం బోవునప్పు డెద్ది యేనిం జేకు
ఱు నే? మేము నీ సర్వంబునుం గొనినయక్షంబులము సుమ్ము.
నీకుం బుట్టం బవశిష్టం బగుట నది యీరూపంబునం గొని
పోవు చుంటిమి. పోయి వచ్చెద. మని చెప్పి మొయిలుత్రోవం
బోయె. ఔరా! ఇదియె కాఁబోలు! పైబట్ట యుం బక్షు లెత్తు
కొని పోయె నని చెప్పుట. దైవగతి తప్పినప్పు డెన్నెన్నియిడు
మలం గుడువ వలయునో తెలియదు గదా. ఆజాయాపతు
లొండొరులం జూచుచు నేడ్వలేక నవ్వుచు దైవికకృత్యంబున
కాశ్చర్యంబు నొందుచు నేగుచో దంపతు లేకదేహు లను
మాట తథ్యంబు గా నప్పతివ్రతామణి గట్టినచీరచెఱంగు తన
కుం బైబట్ట గాఁ జేర్చికొని కొంతద వ్వరిగి యాతం డాసతి
తనయెదుటం గడగండ్లం గుడుచు చుండంజూచి యోర్వఁజాలక
"యోమృదులాంగీ! నీవు దేవతల నిరాకరించి నన్నుం జెంది
యొక్కసౌఖ్యంబునుం జెందుట లే దయ్యె. అన్నవస్త్రంబుల
కును దూరమై యుండ వలసె. విదర్భేశ్వరుగర్భంబున జనిం
చుట యాదిగ మత్పాణిగ్రహణంబు దనుకఁ జెట్టునీడం బెరిఁ
గిన లేఁదీవకై వడి నుంటివి. అట్టినీ విందు నాతో నెండలకు
వానలకు నోర్చుచుం బరుషశిలాకంకటకభరితం బగునిగ్గహ
నంబునం గ్లేశంబనుభవింప నేల? ఈతెరువులం గాంచుము.
ఇం దేగిన దక్షిణాపథంబునకుఁ బోవచ్చు. ఇటు వోయిన విద

ర్భాపుటభేదనంబుం జెంద నగు. ఇటు కోసలపురంబుం జేరుట కనుకూలంబు. ఇం దరిగిన నుజ్జయినీపురంబు గాన్పించు. ఇందు నీమనమున కెయ్యది రుచించు నం దేగుము. ఎం దేని నుండి నీ వైన సుఖంతు గాక!'' అనిన నయ్యిందుముఖి పట్ట రాని శోకంబునం గంఠం బెత్తి బోరన నేడ్చుచుఁ గన్నీరు దుడచుకొని యి ట్లనియె "ఓనాథా! మన మిరువురమును విదర్భా పురంబునకుం జని యందు సుఖంబుగ నుండవము. మజ్జనకుండు మనల నాదరింప కుండఁడు.'' నావుడు నా తం డను, "ఓమృగాక్షీ! నీపలుకులు సత్యంబులు. ఉత్తమశ్లోకుం డగుభీమభూమండలేశుండు లేశంబు గాని మనకు లోపంబు వొరయకుండం గాపాడుటకు నించుక యు సంశయంబు లేదు. తదీయరాజ్యం బస్మద్రాజ్యంబ కాని యొండు గాదు. నాకు నం దేగిన రాజ్యనాశక్లేశం బడంగు. ఐన ము న్నాపీటికి నాకరణిం బాకశాసనసమానైశ్వర్యంబుతో నేగి బంధుమిత్రాదుల నానందింపం జేసి వారిచేఁ బొగ డొంది నేఁ డిక్కరణి నిరువురము నేక వస్త్రిల మై యన్నంబు లేక యాఁకటం గృశించి వివర్ణాంగుల మై యేగుట లజ్జాకరంబు గాదె. అట్లు వోయి జీవించుటకన్న మరణంబు శ్రేయంబు సుమ్ము. నాకు దైవం బెట్లు సేయం దలంచె న ట్లగుం గాక.'' అనిన నప్పతివ్రతామణి మగని మొగంబునం జూపు నిలిపి యి ట్లనియె. "ఓమహాపురుషా! తమ కెఱుక పడని ధర్మం బొండు లేదు. నావచించునుడువులు త పైనఁ నొప్పైనం జెవిఁజొన్పవలయు. పురుషునికిమగువయనునది

శరీరంబున కించుక నొప్పి యొదవక యుండం గాపాడుచు సుఖింపం జేయుటకై యేర్పడియె. ఎండ గాయునపుడు గొడుగై పరుషస్థలులం బోవునపుడు పాదరక్షయై నిర్వాతస్థలంబున వీవనయై యుండును. క్షుత్తృషాపీడితుండై యున్న నప్పీడం దీర్చుటకు భార్యయ తగు. భర్త ధనవంతుండైన నిస్స్వుండైన సుఖియై యున్న రోగార్తుండైనం బ్రసన్నుండైన గోపావిష్టుండైన సర్వభోగంబులు నొసంగినం బీడించిన నొక్కతెఱంగునం జూచుచు నాతనితో సుఖదుఃఖంబు లనుభవించునది యే కులాంగన. మగండు మగువను సుఖింపం జేయుట కర్హుండును నిడుమలం బెట్టుట కనర్హుండు నగు నే? తా నిష్టభోగంబు లనుభవించుచు నాతి నేచఁడు గదా? భరించువాఁడు భర్త భరింపఁ దగినది భార్య కావున నయ్యింతి మగని నెడఁబాసిన నిధర్మంబులు తప్పి పోవును. అంగనలకుం బతియె దైవము పతియె నోము పతియె తీర్థంబులు పతియె సమస్తధర్మంబులును. ఆతనివలన నిహాపర సౌఖ్యములం బొందు యత్నంబు యోషిదధీనంబు గాని పురుషాధీనంబు గాదు ఇట్టి సద్వర్తనంబునం జరించుసత్కుటుంబినినివిడిచినధవునికినిసుఖంబు దుర్లభంబు సుమ్ము. పుత్త్రియాసంబు నారించునుపాయంబు తల్లి కెట్లెఱుఁగునట్లు భర్త్రాయాసంబు వారించునుపాయంబు భార్యకు నలవడుం గాని యది యన్యకృత్యంబు గాదు. కావున నన్ను వీడక నాప్రాణంబులు దేహంబునుం ద్వదధీనంబు లని యెంచి నీయిష్టానుసారంబుగఁ దిప్పుము. మరలం

బైనుత్తరంబు నొసంగితి వేని నీతోఁ దుల్యంబుగ వాదించు శక్తి గలదానం గాను. నిన్ను విడిచిన స్వర్గంబైన నాకు సౌఖ్యదం బగు నే" యనిన 'నోయింతీ! యింతదూరంబు నడువ నేల? నాకుం బ్రాణపదంబ వగునిన్ను నే నెట్లు విడుతుం జింతింపకు' మనె. అతిగహనం బైనయరణ్యంబున కేగి యందొక లచ్చకొట్టముం గాంచి వారందు విశ్రమించిరి. అంత సూర్యుం డపరదిశాకర్ణావతంసం బయ్యె. సంజకెంజాయ యాకాశారణ్యంబునం బుట్టినయెరగలి యనం బర్వె. అట్టిదవానలంపు వెట్టలకు నోర్వమిచేఁ బోలె ఖగంబు లెల్లయెడల రొదలు సేయుచుం బాఱం దొడంగె. లోకంబునం గొందఱు సుఖించు చుండు గొందఱు దుఃఖించు చుందు రనుటకు నిదర్శనంబుగాఁ దొవలు వికాసంబున రాజిల్లె. పయోరుహంబులు ముకుళించుచు నింపుగా కుండె. సుఖానంతరంబున దుఃఖంబు నుండు నను పోలిక వెలుఁగులువాసి యిరులుగ్రమ్మసాగె. కోకదంపతులు నలదమయంతుల భావివియోగంబు సూచించుచు దూరీభూతపరస్పరంబులై యాక్రోశించె. మీకు నెల్లకాలంబు నిదుఃఖంబు నిశ్చయంబుగా దానందంబు సేకూఱు నని తెల్పువిధంబునం జీఁకటులు వాసి చంద్రికలు వ్యాపించె. అట్టియెడ దూరాధ్వఖిన్నులై యాయిరువురు నందు నిద్రించిరి. సకలభూపాలమౌళిమణిసీరాజితపాదపంకేరుహుం డగు నాచక్రవర్తి దుర్గమారణ్యంబునం గటికినేలం బన్నుండి నిద్రించె. ఆఁకలి రుచియును నిద్రసౌఖ్యంబు నెఱుఁగవు గదా. అట్లు నిదురించి నిశీథానంతరంబున నానేల

ఱేఁడు విగతస్వాపుం డై లేచి తనయంఘ్రిప్రాంతంబున ధూళి ధూసరితాంగి యై యొడలు మఱచి నిదురించునమ్మహిషిం జూచి యి ట్లని వితర్కించె. అక్కట కటా! హంసతూలికా తల్పంబుపై దిండులం జేర్చుకొని వరవుడంపుంబడఁతులు మెల్లనం బాదంబు లొత్త నొకతె మందమందంబుగఁ జామరంబు వీవ శయనించి యెట్టకేలకు సుప్తిం జెందునిక్కోమలి పథిశ్రాంతి నీనిరావరణస్థలంబున నై మఱచి నిదురించు చుండె. ఇట్టికుసుమకోమలి నానిమిత్తంబున నింత బాములం బడుచుండె. ఏల నాబ్రతుకు? సాధ్వీరత్నంబు నిడుమల నందించిన క్రూరుండు నొకమనుష్యుం డే? ఇన్నియాపదలం బొందు చుండియు నన్ను వీడం జాలనియిమ్మగువయుమ్మలి కమ్ముఁ జూచుట కెంత పాపముఁ జేసితి నో! ఇటుపై నీయింతిసంతాపంబుఁ జూడ నోప ఇపుడు నే నెందుల కేని నేగిన నిక్కోమలి మేల్కని నన్నుం గానక తనబంధుజనంబులఁ జేరి సుఖించుఁ గాక! అని చింతించి మెల్లనం దదుత్తరీయార్ధంబుఁ జీఱి తనకు నుత్తరీయంబు గాఁ దాల్చి మెల్లన నడుగు లిడుచుం బోయి మగల నద్దమయంతిం డించి పోఁ జాలక వచ్చుచుం బోవుచుం గొంత సేపు మల్లాడి ప్రేమరజ్జుసమాకృష్టుం డౌటం బోవం దూలుచుండియు మరలి వచ్చుచు ని ట్లుండియుండి తుదం గళిత్రుటిత ప్రేమబంధుం డై దుష్టశ్వాపదమేదురం బగు నీఘోరారణ్యంబున నీభీరువు నెట్లు విడిచి పోదు నని యించుకయు సంశయింపక యెం దేనిం జనియె. తదనంతరంబునం దెల్లవాఱుడు నా

రామామణి నయనంబులు విచ్చి లేచి నలుదెసలుం జూచి ప్రాణే శ్వరుం గానక శోకవ్యాకులితమనస్కయై యతిభీతిం జీమ చిటుక్కు మనం గుయ్యిడుచుం జెట్టుచెట్టుం జూచుచుం బొద పొదయుం దూఱుచుం గంటకంబులకుం బాషాణంబులకు వెను దీయక పాదంబులం గ్రుచ్చికొన్న కంటకాగ్రంబులనైన వెలు వరింప నెఱుంగక యిట్లని శోకించె. హా నిషధనాథ! హా ప్రాణనాథ! నన్నిట్లు విడిచిపోవ నేనెట్టియపరాధం బొనర్చితి? దయావంతుండవై నసీవు నన్ను సింహవ్యాఘ్రభల్లుకలులాయ భీషణం బగు నీసంకటారణ్యానీమధ్యంబున విడిచి పోవ నెట్లు చొరవఁ జేసితివి? నన్నొక క్రూరమృగంబు వాతం బడవైచి యైనం జనుము. జీవించి యీయాపదలం గుందఁజాల. నిన్ను నెన్నండు వీడ నన్న ప్రతిజ్ఞ యేమి చేసితివి? నీయైశ్వర్యంబుతో సత్యపరిపాలనదక్షతయుం జెడి పోయెం గాఁబోలు. ఓమృగ శ్రేష్ఠమా! నాథుం జూపుము. ఓవృక్షములారా! నాప్రాణే శ్వరుం జూపుఁడు. ఓశరారుపులారా! నమస్కరించెద. ఈపాపా త్మురాలిం జక్కాఁడి చిరదుఃఖంబుం బాపుఁడు. అని యిట్లు గుండియలు చెదరం బేరెలుంగున నిట్టూర్చుచు మూర్ఛిల్లుచు లేచుచుం గొంత నేల యరిగె. ఆసాధ్వీమణి దురవగాహం బైన గహనంబునఁ బలుగుఁబులుఁగుల యెలుఁగుల కులుకుచుఁ బలుపులులలాఁటులకు నోటు వడుచు నెలుఁగులబొబ్బల కులికి పడుచు నిజనాథాన్వేషణతత్పరత్వంబునం బోవుచుఁ జేతనాచే తనభేదం బెఱుంగక యెల్లవానిం బతిమార్గం బడుగుచు నొక

నీరంధ్రకాననంబునం బరమనిష్ఠాగరిష్ఠు లై బ్రుసీసమాసీను లై
నియతవ్రతు లై నిరాహారు లై పరమాత్మైకాయత్తతం దపం
బొనరించు మహర్షులయాశ్రమంబుం గాంచి దైవవశంబున
వారలుం దనప్రవేశసమయంబున సమాధివలన నుత్థితు లై
యుండ వారలకు దండప్రణామం బాచరించి తదభిముఖ యై కర
ద్వయంబు ముకుళించి నిలిచిన నన్నిరాహారు లాచారుగాత్రిం
జూచి 'యవ్వా యెవ్వరిదానవు? ఇట్లొంటి గా రాఁగతం బేమి?
నినుం జూడ నస్మదంతరంగంబులు ప్రసన్నంబులయ్యె. ఇట్టిసు
కుమారం బగు శరీరమును దేజరిల్లుచు ని ట్టీ పరుషవనమునఁ
జరింపఁ బని యేమి?" యని యడుగ "ఓభగవంతులారా! యుష్మ
దీయదర్శనమునఁ నాకుం గలయాపద లెల్లందొలంగె. నే నిపు
డనుభవించు దుష్కృతఫలమునవించుక సుకృతఫలముం గూడె.
అ ట్లౌట భవదీయసేవ సంఘటిల్లె." అని నిజవర్తనం బాద్యం
తము సావధానయై చెప్పి "ఓతాపసవర్యులారా! నాజీవితేశ్వ
రుం డిట వచ్చి యెట కేగె? ఎం దుండె? కరుణించి యానతి
యొసంగి మత్ప్రాణరక్షణపుణ్యంబుఁ జేకొనుం" డని జొట
జొటం గన్నీరు జొబ్బిల వగచు చున్న యత్తరుణిం గరుణించి
చూచి "యమ్మా! యుమ్మలింపకుము. నాతిచిరకాలమున
భవత్ప్రతియోగమున రాజ్యలాభమునం గృతార్థ వై సుఖింతు
విది నిశ్చయం" బని నిజచ్ఛాత్రులతోడ నంతర్హితు లైన
నమ్మౌనిని యబ్బురంబుం దబ్బిబ్బు నొదవ నిది కల యొ
నాచిత్తభ్రమం బో మాయ యో యింద్రజాల మొ లేక

నాయదృష్టవిశేషం బో యని చింతించుచుం జని చని కొంత దవ్వున నొక్కబిడారుం గాంచి నా కొక్కసాహాయ్యం బొదవె నని సంతసిల్లుచుండె. రూపవతి య య్యుం జీకాకు పడి యున్న యన్నెలంతం జూచి యచ్చనుపయందలి జనంబులు నవ్వువారును, బెదరువారును, బ్రణమిల్లువారును నగు చుండ నచ్చటి వణిగ్వరుం డగు శుచిసమాఖ్యుం జూచి యాచెల్వ "ఓనరోత్తమా! ఏను నలభూపాలుపత్నిని. ఆతనిం గానక తిరుగు చుంటి. మీయం దెవ్వ రేని మత్ప్రియుం జూచినం జెప్పుఁడు. పుణ్యంబుఁ గట్టికొనుఁ" డన నాతండు 'మే మాతనిఁ గాంచ లే'దనిన "మీ రెందుల కేగెదరు? నను మీతోడం గొని మీ చెలియలిఁ గా నెంచుకొని యెద్దేని నొకయూరు సేర్పుఁ"డనిన 'మేము చేదిదేశనాయకుం డగు సుబాహు ధరణీధవు వీటికి నేగెదము. అచటికి వచ్చెద వే' యనిన నప్పతిదేవత వల్లె యని వారితో నేగు చుండె. ఆసార్థవాహసార్థంబు ప్రొద్దధికం బై యాతపం బతితీక్ష్ణం బై తోఁచునంతకు నక్కానం బోయి పోయి దర్భసమాక్రాంతంబునం బధికాయాసం బడఁగింపం జాలి యతిరమ్యం బైన యొక్క సరోవరం బవలోకించి యారాత్రికి నిం దుండి పోద మని తద్రోధోభూమి విడిసి తదంభఃపానావగాహనిరస్తశ్రములయి యారేయి యందు నిదురించిరి. అంత నడురేయి నొకవన్యద్విపవ్రాతము సంతతసముయువారివాహనివహాభీషణం బై బృంహితముల నాకసము బీఁటలు వాఱం బిపాసాపీడితం బయి యక్కమలాకరమున నీరువట్టు దీర్చుకొనం

దొందరపాటున నిద్రాపరవశం బయి యున్న యచ్చనుపనడుమం బడి హతాత్ప్రబుద్ధులయి యిది యేమియుపద్రవం బని గొల్లున మొఱ వెట్టుసజ్జనములయులిఫునం బెదరి యానాగ ములు వారి నెల్ల రోళ్ళం బోలునంఘ్రితలముల మర్దించు నవియు రోఁకళ్ళం బోలుదంతములం గుమ్మునవియు గొండ చిలువలం బోలుహస్తములం జుట్టునవియు ఘీంకారములఁ గుండె లవియం జేయు నవియు నెగిరిపాటునం బదుగుర నూర్వురం జదుపునవియు నౌచుండ సజ్జనులు మొఱ్ఱో యనుచుం దండ్రీ యనుచుం దైవమా యనుచుం బాఱువారును నలుఁగు వారునుం దూలువారునుం జెట్లెక్కువారునుం గొలనిలో నుఱుకువారును డొంకలు దూఱువారు నైరి. అప్పు డప్పొలంతి యావంత యావంత యుం బొరయక తప్పి 'యక్కటా! విధి చెయ్వు లెంత వ్యత్యస్తములు! జీవితాపేక్షు లయి సుఖింప నయి యున్న వారలప్రాణములు గొని మరణాపేక్షిత నయి దుఃఖించునన్ను విడిచె' నని చింతించుచు వేగించు చుండం బ్రొద్దు వొడిచె. అంత నాపత్తూర్యాపమున హతశేషజనముల తోఁ జేదిపురమున కేగి తద్రాజపథమునం బోవుచు రాజమాత దాదిచేఁ బిలిపింపం దదధిష్ఠితహర్మ్యతలమున కేగిన నాకె యు భస్మచ్ఛురిత యగునగ్నిశిఖ యుం బోలె నున్న యత్తొయ్యలిం జూచి తన్నిబద్ధస్నేహ యై యి ట్లనియె.

ఓబాలామణీ! నీ వెవ్వరిదానవు? మేఘావరుద్ధచంద్ర కాంతి యుం బోలె దుఃఖాక్రాంత వై యున్నట్లు కాన్పించు

చున్నదానవు. ఇది యేమి? అనినం గర్మనియోగంబున నరాతి
జైత్రుం డగునాపతి ద్యూతంబున విజితుండై వనంబున కేగు
చుండ వనటం జెంది నేనునుం దో సరిగి యొకచో నాయభా
గ్యంబుం బోలె నిద్ర యాక్రమించినం దదధీన నైనన్ను
విడిచి బుభుక్షాపీడితుండై యెందేని నరిగినం దద్గవేషణాసక్త
నై త్రిమ్మరి. యాతనిజాడఁ గానక తద్విరహదండహ్యమాన
మానస నై తిరిగి తిరిగి యిందు వచ్చితి. అని వేఁడినిట్టూర్పు
పుచ్చుచు నశ్రుధారలం గ్రుమ్మరించుచున్న 'నోయమ్మా!
యోడకుము. నీపతి నెమకం దగిన భూమీసురులం బుత్తు.
ఇందుండు'మనిన నామానవతి యమ్మానవపతిజననికి ట్లనియె.
'అమ్మా! నేసైరంధ్రివృత్తిం జరించుచు నుచ్ఛిష్టంబునం జెయి
సేర్పక పాదసంవాహనము సేయక పరపురుషులతోఁ బలుకక
నాప్రియు నెమకఁ బోవుపాఱులతో భాషించుచు నుందు. అ
ట్లునికి నీకిష్టం బేని నిం దుండెద' ననిన నీ కెట్లు హితం బట్ల
యుండు మని తనతనూజ యగుసునంద నామె కొప్పగించి
యాదరంబునం జూచు చుండె. అట్లుండి యాయోషామణి
సైరంధ్రిత్వంబునం బుణ్యశీల యై చైద్యనాథునగరంబున నతి
దుస్సహవియోగభారంబున నహోరాత్రంబు లతిదుస్తరరీతిం
గడపు చుండె. అట నలభూపాలుం డరణ్యంబున నేగుచు
'అక్కటకటా! అట్టియున్నతదశలం బొందుచు సుఖించువాఁడ
నెంతవ్యర్థుండ నైతిని. సచివాదులు చెప్పం బెడచెవులం బెట్టితి.
నాదూరదృష్టిదూరశ్రవణంబు లెందు డాఁగె? ఇది విధినియో

గంబు గాక మనమెఱింగి చేసినది గాదు. మనుష్యుం డెల్లపుడు మేలునకై యత్నించుంగాని కీడునకై యత్నింపఁడు గదా! దైవం బనుకూలించిన నాయత్నంబులు సాగును. లేనిచో వమ్మై పోవును. జనుం డొకప్పుడు బుద్ధిమంతుఁడు నొక ప్పుడు బుద్ధిహీనుండు నగునా? కార్యములు చెడఁ జేసితి నని యీ బరువు తలపైఁ బెట్టుకొనుం గాని యెగ్గులలో నొకదాని కయినఁ బురుషునకు స్వాతంత్ర్యము లేదు. అప్రయత్నముగ నాపద లెట్లు వచ్చునట్లు సంపదలుం జేకుఱు. ఇందులకై వగన నేల? కానున్నది యవశ్యముం గాక పోదు.' అని చింతించుచుం బోవఁ బోవ నొక్కచో చట చ్ఛటారావంబులతో విస్ఫులింగంబు లతిసాంద్రంబు లయి యెగయ భుగభుగధ్వనులతో జ్వాలాజాలంబు మిన్నుముట్టఁ గహకహనినాదంబులతోఁ బత్త్రిరథములు చెదరి పాఱ గుప్పు గుప్పునం బొగ లభ్రపథంబున నభ్రమండలముగతిం గ్రమ్మ దావమధ్యమునం దానవహ్ని ప్రజ్వలించుచుండఁ దన్మధ్య మున నుండి, "హా నిషధనాథ! అగ్గిమంటలు సమీపించు చున్నవి. తడవు సేయక నన్నీ విపత్తివలనం దొలంగించి కాపాడు. నీకు ధర్మంబు చేకూఱు. నీ కోపినంత ప్రత్యుపకా రం బొనర్చెద. నన్నుద్ధరింపుము. రమ్ము రమ్ము." అని యార్తరావంబు విన వచ్చిన నాచిచ్చునకు బెదరక యోసరిలక యందేగినం గిలికీలాపరివృతుండై యున్న యొక్క సర్పకుమా రుండు కన్నీ రొలుక నిట్లనియె.

'నేను గర్కోటకుం డనుభుజగంబను. ఒక బ్రహ్మర్షికి నెదు రాడినపాపంబునఁ గదల నేర కుంటి. అగ్నిమంటలు దఱియు చున్నవి. త్వర పడి నన్నుఁ దప్పింపుము. నీ కుపకరింతు' ననిన నతండు తత్పన్నగంబు నెత్తినం జులుక నై యుండ నొక్కసరసీ కూలంబుఁ జేర్చ మఱియుం బదియడుగు లేగు మని యప్పాఁప ఱేఁ డాభూపవరుం గఱచె. అయ్యుత్తరక్షణంబున న తద్విష వ్యాప్తిచే వికృతదేహుం డై యున్నయన్నలుం జూచి 'యో రాజోత్తమా! నాచే దష్టుండ వై నందున నీవు చింతింప వలదు. నీవు ప్రచ్ఛన్న వేషంబున నుండ వలయుఁ గావున వికృతరూపుం జేసితి. నాగరళంబు నీమేన నున్నకాలంబున నీకు విష రాక్షసాదిబాధ లొందవవు. నీకు నిజరూపంబు గై కొన వలసి నప్పుడు నన్నుం దలంచెద వేని నీపుట్టంబు నిన్నుం జేరును. దాని ధరింప నావిషంబు దొలంగి పోవును.' అని చెప్పి నిజ రూపంబుం జూపి మఱి యు ని ట్లనియె. 'అయోధ్యాపురా ధీశ్వరుం డై యిక్ష్వాకువంశసంభవుం డగు ఋతుపర్ణుం డను వాని సారథ్యవ్యాపారంబున బాహుకనామంబుతో సేవించి నీ వతనికి నశ్వహృదయం బొసఁగ యక్షహృదయం బను విద్య నాతనివలనం జేకొనుము.' అని యతం డంతర్హితుం డయ్యె. అంత నాభూపాలుండు కర్కోటకోక్తప్రకారంబున నయోధ్య కేగి ఋతుపర్ణుం జూచి 'యోమహారాజా! ఏను బాహుకుం డనువాఁడ. అశ్వవిద్యాపారగుండ. దుష్టాశ్వంబుల సాధూక రించెద. ఆవర్తవిశేషంబులం జూచి తత్తత్ఫలంబులు సదృష్టాం

తంబు గాఁ జెప్పెద. జక్కి నెక్కునపుడును దేరులకుం బూన్చు నపుడును వాని హృదయం బెఱుంగుదు. కోపించినకత్తలాని బ్రసన్నంబుఁ జేయుదు. భయంబు వాపి నడపుదు. దశధ్రువం బులుం దక్కుసుడులు వర్ణవిశేషంబులు నారయకయె హేషా నాదంబు విని తల్లక్షణం బెల్లఁ దెల్లంబుగ వివరింతు. వినోద కరంబు లగు నడకల శిక్షించి యేలిక కానందంబు సమకూర్తు. మఱియు సూదవిద్యయందు నింతప్రవీణుండ. మనుష్యునిం జూచి తదిష్టంబు లగువస్తువులు తెచ్చి తదర్థముగఁ బాకం బొనర్చెద. నా చేతియోగిరంబు భుజించువానికిం జికిత్సకునిం బిలుచుట యనావశ్యకము. రోగార్తుండై జిహ్వాదోషమున నరుచి వొడమి యన్నము గుడువ నొల్లనివానికి నవలీల నాహా రాసక్తి గల్గించెద భుజించెడుతటి నభిలషితార్థం బడుగక యె యొసంగెద. ఆఁకలి హెచ్చింపం దగ్గింప సమర్థుండ. అయ్యా! ఇప్పు డిది యెల్లఁ జెప్పినఁ బొగడిక యై పరిణమించును. సర్వ ముం గ్రియవలనం గాంచి యర్హుఁడ నని తోఁచిన సేవ కంగీక రింపుము. లేనిచో వలదు. నా కాహారము దక్క నొండు వేతనము వలదు.’ అనిన నాఋతుపర్ణుండు సంతసించి ‘ఓ బాహుకా! మత్పురంబున నుండి యశ్వ ముల శిక్షించి బాగొనర్చుచుం బాకము సేయుచు నుండు’ మని వార్ష్ణేయజీవలు లనువారి నాతనికిం దోడొసంగినం దదుక్త ప్రకారమున నలుం డం దుండి ఋతుపర్ణునొద్ద యథార్హ సేవ యొనర్చుచుండె. అయ్యెడ భీమమహీపాలుండు తనకూఁతురు

నల్లుండును రాజ్యనాశంబొంది యెందేని నరిగి రని చారుల వలనం దెలిసి పెద్దయుం బ్రొద్దు వగచి చతురులును హితులును ధర్మశీలురు నగు విప్రోత్తముల రావించి నలదమయంతులంc జూడం దలంచి వారియున్నచోటు దెలిపి నాదీనావస్థ దీర్చిన వారికి వేయిదీనారములును వారలం దోడితెచ్చినవారలకు నుత్తమగవీసహస్రము నొసంగుదు నని పుచ్చిన వార లూరూ రుం బల్లెపల్లెయుం జూచుచుc దమయుద్యమము వెల్లడి గా కుండ నెందేని నొకయుత్తమనరుండు గాని యొకయుత్తమాం గన గాని నేత్రపథంబులం బడిన వారిం జక్కంcగ విమర్శించు చుం గేవలధనాసక్తిం గాక రాజకార్యసమాదరంబున విసువక తిరుగు చుండిరి. అందు సుదేవుం డనుపుడమివేలుపు సుబా హుపురంబునకు వచ్చి యందుం బ్రత్యహంబుc బుణ్యాహంబు సేయించు ద్విజవర్యులతో శుద్ధాంతంబున కేగి సునందతోc గూడి యున్న యద్దమయంతిని సూక్ష్మలక్షణంబులచే భీమా త్మజcగా నిశ్చయించి 'అక్కటా! ఇక్కోమలి పతివియోగం బునం జంద్రవియుక్తయగు నిశం బోలి రాజిల్ల కుండి యుc దనపాతివ్రత్యాదిగుణంబులచే నుడుగణంబులచేతం బోలె రం జిల్లు చుండె. యువతు లేయలంకృతులచేc గాని పతిభక్తిం బలెc బ్రకాశింతు రే? పాతివ్రత్యంబు నాcగ నాగయానలకు శోభాకరంబును బలకరంబును సౌఖ్యకరంబును యశస్కరం బును గాదె. కుండినపతి యీపుత్త్రికారత్నంబు నల్లుండుం గలసి యుండం జూచి యానందించు పుణ్యంబున కై మనము

సంతసించుభాగ్యం బెన్నండు గందు మో! అదియు నాసన్నం
బై యుండె నని తోఁచెడి. ఏతద్దర్శనంబు భావిశుభంబునకుం
బ్రోవ గాదె' యని తలంచి యయ్యోషిద్రత్నంబు చెంతకుం
జని యల్లన నిట్లనియె.

'దమయంతీ! నేను విదర్భానగరంబుననుండి
వచ్చినవాఁడ. నీయగ్రజమిత్రుండ. సుదేవుం డను
ద్విజుండ. అందెల్లవారు క్షేమంబున నున్నవారు.
నీవును నలుండు నెందేగిరో యనుచింతయ తక్క నొక్క
కొంత లేదు. మిమ్ము రోయంగ నీజనకుం డనేకుల ననేక
దేశంబులకుం బుచ్చె. అందు నేఁడు నాకుం బుణ్యదినంబయ్యె.
నాభాగ్యంబున నిన్నుం బొడగంటి' ననిన నచ్చెలి వెచ్చకన్నీ
రొలుక వెక్కి వెక్కి యేడ్చుచు నందున్నవారికిఁ శలం బడుగు
చున్నంత సునందాబోధితయై రాజమాత వచ్చి యవ్విప్రున
కిట్లనియె. 'అయ్యా! ఇయ్యిందుముఖి యెవ్వనికన్నియ? ఎవ్వని
మగువ? దీనినామం బేమి? ఇట్లుండం గతంబేమి? దీని నీ వెట్లు
దెలిసితివి?' అన సుదేవుం డంతయుం జెప్పి 'యిక్కోమలికిం
గూర్చంబున నైశ్వర్యలక్షణం బగుపద్మాకారచిహ్నంబు రజః
పటలనిహ్నుతం బై యుంటఁ గాంచి మీరాజపుత్త్రింగా నెఱిం
గితి.' నన నారాజమాత తద్భ్రూమధ్యంబు శుద్ధజలంబులఁ
గడిగించి యమ్మచ్చం జూచి యాశ్చర్యంబు నానందంబుం
బొందుచు నన్నబోఁడిం గౌఁగిలించి 'అమ్మా! మీయమ్మయు
నేనుం దశార్ణ రాజపుత్త్రికలము. నేను వీరబాహునకును

మీతల్లి భీమునకుం గళత్రంబులమైతి’ మనిన దమయంతి సంత
సించి కొంతకాలం బం దుండి ‘అమ్మా! నాకు నీ యిల్లును భీమ
గృహంబునుం దుల్యంబులయైనం దలిదండ్రుల భ్రాతృపు
త్రులం జూడ వేడ్క యయ్యెడి. పోయి వచ్చెద. అనుపు’
మనిన సుబాహుప్రేషిత పరివారంబుతో సద్దమయంతిం గన
కాంబోళికారూఢం జేసి విదర్భానగరంబునకుం బుచ్చె. అ ట్లేగి
యక్కోమలి సర్వబంధుసందోహంబుతోఁ గూడియు నిష్ట
భోగంబు లనుభవింపక మలినాంబరధారిణియుం గృశాంగియు
ననాస్తృతధరణీశయనయు నై యెన్నండైన నలుం జూతునో
యని మది నువ్విళ్ళూరుచుం దద్వియోగంబు సహింప నోపక
రహస్యంబునం దల్లి కిట్లనియె. ‘అమ్మా! కొమ్మల కెందఱు
బందుగులుం జెనిమిటికిం దరువాతివారలు. భామినికి సర్వశరీ
రంబు భర్తయ కావున భర్తృదూర యయినమగువ నిష్ప్రాణం
బైనబొందియ గాదె? పతివియుక్త యైనదానికి సర్వభోగంబు
లును మొరడున కెత్తిననీరంబులు గావె? పెక్కు టెక్కులం
దేజరిల్లు రాత్రి చందురుండు లేక ప్రకాశింపనిచాడ్పున బంధు
జనపరివృత యయ్యుం గోమలి పతివియుక్తయై కొఱగాకుండు.
ఆతనిం గూడినమగువకు దారిద్ర్యాది దుఃఖంబులునుం బాటి
గావు. కావున నాపతి నన్వేషింపం దగు’ నన నామె దమయంతి
పలుకు భీమభూపతి కెఱింగించిన నతండు నిపుణులగు బ్రాహ్మ
ణుల నలాన్వేషణంబునకుం బుచ్చుచుండ వారలతో దమ
యంతి యిట్లనె. నిషధేశ్వరుం డెందేనిం బ్రచ్ఛన్నదశ నుండుం

గావున రాజసభాంతరంబుల కెల్ల నరిగి యిట్లు వచింపుఁడు. 'ప్రాణతుల్య యగు భార్యచేలంబు దఱిగి యది పరిధానంబుగాఁ జేసి యయ్యింతిం బరిత్యజించి యరుగుట ధర్మమే? నిన్ను వీడ నని చెప్పినపల్కులు కల్లలు సేయం దగునే?' అనిన నెవ్వం డుత్తరం బిడు నాతని నలుంగా నెఱింగి రండని చెప్పి పంపిన వారలు ప్రతిరాజసభం బలికి యుత్తరంబు వడయక విదర్భా పురంబుం జేరిరి. అందుఁ బర్ణాదుం డనువిప్రుండు వచ్చి దమ యంతి కిట్లనియె.

"అమ్మా! అయోధ్యాధినాథుం డగు ఋతుపర్ణు పరి చారకులలో నొకండు పొట్టివాఁడును గుత్సితశరీరుండును బాహుకనామధేయుఁడు నగువాఁడు పాకవిద్యయందు నశ్వ శిక్షయందు నతిసమర్థుండు. నీకఱపినమాట లాతేనిమోఁసలం బలికిన నన్ను రహస్యంబునకుం బిలిచి పురుషులయంద దైవ వశంబునం దోషంబులు గల్గిన సహించు నేని నయ్యింతి యుభ యలోకసౌఖ్యంబు లనుభవించుం గదా యని మఱి పలుకక యరిగె" ననిన 'నాతండ నలుండు గా వలయు. మఱియుం గొంత విమర్శింత' మని సుదేవుం జేరం జీరి 'నీ వయోధ్య కేగి న న్నెఱింగినట్ల నలు నెఱింగి ఋతుపర్ణునొద్ద విదర్భేశ్వరుండు నలుం గానక యెల్లి దమయంతీ ద్వితీయస్వయంవరంబు సేయు నని చెప్పి ర' మ్మనిన నాతం డట్లొనర్చె. ఆఋతుపర్ణుండు బాహుకుం బిలిచి "రేపు దమయంతీస్వయంవరం బఁట! అది చూడ నొక్కనాఁట నవ్విదర్భానగరంబున కేగ వలయు.

నీయశ్వవిద్యానైపుణ్యంబుఁ జూతుం దేరు పూన్పు" మన
గుండె జల్లు మన నలుండు మనంబున నిట్లు చింతించె. "స్త్రీలకుం
దమపై రాగంబు గల దని మగవారలు దలంచుట వెఱ్ఱితనము.
ఇద్దమయంతి యడపిలో న న్నొడఁబాసి సాధ్వి యనఁపించు
కొనియు ని ట్లేల చేయంగడంగె? ఇది యొద్ది యే నొక వ్యాజంబు
గా వలయు. కానిచో నావలన నపత్యవతి యై యి ట్టి
రామామణి యొనర్చునే? అది యటుండ ని మ్మాఋతుపర్ణుం
డేతలంపున నేగు చుండె? ఈతని కైన దమయంతీజిఘృక్ష
కలుగు నని యెంచ. ఇట్టి విరుద్ధం బెట్లు చెడ కుండం బొసంగు
నని చూడం బోయెదు. ఐనం దినఁ బోవు వస్తువునకు రుచి
యడుగ నేల? ఎల్లవి యుం దెల్లంబు లగు. చూతుం గాక"
యని పైనంబు సమకట్టె. వార్ష్ణేయుండు బాహుకానుమతి
శుభలక్షణాన్వితంబు లగుహయంబులఁ దేరికిం బూన్చిన నవి
మ్రొగ్గతిల్లం గాంచి ఋతుపర్ణుం డీపేద గుఱ్ఱంబు లెట్లు నడచు
నన నలుండు చిత్తగింపు మనిన నాతండు రథారోహణంబు
సేసె. ఆనలుండు నారథచోదనంబు సేయు చుండ నిది పర్వతం
బనియు నిది యరణ్యంబనియు నిది నదియనియు నిది పట్టణం
బనియు నిది గ్రామం బనియు ఋతుపర్ణ వార్ష్ణేయులకు నిర్దే
శింప నలవి గాక యేత్రోవం బోవు చుంటి మెందులకు
వచ్చితి మని విమర్శింపం గోరి చక్కఁగఁ జూచుచుఁ బరిభ్ర
మితనేత్రు లై వారిరువురు నెఱఁ గొందు చుండిరి. ఋతు
పర్ణుండు తనమనంబున నితండు నిషధాధీశ్వరుం డౌకా! ఆత

నికిం దక్క నింతహయచోదనపాటవం బెవ్వనికిం గలుగు? ఈతండు కొన్నిలక్షణంబుల నలుం బోలియు వికృతరూపంబున నున్నవాఁడు. ఆతని కీగూఢవృత్తి యేల కల్గె? ఐన నెద్దియుం దెలియ నశక్యం బని తనసంవ్యానంబు పుడమిం జాఱిన మరలి చూచి 'బాహుకా! వార్ష్ణేయుం డుత్తరీయంబు దెచ్చునంతకు రథం బింపుక మందయానంబునం బోనిమ్మనవుడు నాతండు స్మేరాననుం డై 'అయ్యా! అయ్యుత్తరీయం బొకయోజనంబు పై నున్నది. ఈతండు తెచ్చునే?' యన ఋతుపర్ణుం డాశ్చర్యంబులో నాశ్చర్యం బనుకొనుచుండ ననేకదేశములు బహువనములు ననేక గిరిదుర్గములుం గడచిరి.

అందు సీరంధ్రితర శాఖాపర్ణపుష్పఫలభరితం బగు నొకయక్షవృక్షం బాఋతుపర్ణుండు చూచి 'యీతాండ్రి చెట్టునం గలయాకులుం బువ్వులుం బండ్లు వేఱ్వేఱ గణించి చెప్పెదం జూడు' మని యి న్నిన్ని గల వని చెప్పిన బాహుకుండు రథంబు నిలిపి యక్కుజం బురులం ద్రోచి తదీయ పుష్పాదికంబు లెక్కించి యాతనిచెప్పినయన్ని యె యుండుట నబ్బుర పడి యివ్విద్య నా కొసంగు మనిన ఋతుపర్ణుం డి ట్లనియె. 'ఇది యక్షహృదయంబు. దీని నెఱింగిన సంఖ్యా జ్ఞానంబును సకలగుణపూర్ణత్వంబుం గలుగు. నీ వశ్వహృదయంబు నా కుపదేశింపుము. ఇది నీ కుపదేశించెద' నని యథావిధి నుపదేశించిన నాతండు ప్రీతుండై 'యశ్వహృదయం బిచ్చెద స్వీకరింపు'మన నయోధ్యాధీశుండు 'నావలయునప్పుడు

గొందు. నీయందయుంచు' మనియె. అంత నావిద్యాసామ ర్థ్యంబునం గలి కర్కోటకవిషంబు గ్రక్కుచుం దోసిలి యొగ్గి 'ఏఁ గలిపురుషుండ. ని న్నింత బాధలం బెట్టితి. ని న్నాశ్ర యించి నేనుం గర్కోటకవిషంబున వేఁగితి. ఇదియ నాకుం దగుదండనంబు కావున నాకుం గోపింపకు' మని యావిభీతక భూజంబు నాశ్రయించె. తదాదిగ నాకురుహంబు నింద్యం బయ్యె. నలుండు వికృతరూప మాత్రంబు దక్కఁ దక్కు దుష్కృతమువలన విముక్తుండై రథంబుం దోలికొని సూర్యుం డస్తాద్రిపై డిగునప్పుడు విదర్భానగరంబున కరిగె. దమయంతి యు నారథధ్వానంబు నంబుదధ్వానంబు మయూరియుం బోలె విని యానందించుచు నలురథంబ కా నెంచి యారథంబున ఋతుపర్ణుం జూచి దురపిల్లె. ఆఋతుపర్ణుండును విదర్భేశ్వర నియుక్తంబైన నివాసంబున విడిసి 'ఔరౌరా! ఇందు స్వయం వరంబునకు రాజు లెవ్వరు రారు. దమయంతి యంతటియధర్మ చరిత యగు నే?' అనుచుం దలఁచు చుండె. దమయంతియుం దనచేసినయత్నంబు వమ్మగునో యని చింతించి కేశిని యను నొక చెలికత్తెం బిలిచి 'ఓయింతీ! ఈరథాధీశుండు ఋతు పర్ణుండు వార్ష్ణేయుండు సారథికుమారకుండు నగుదురు. బా హుకుం డనువాఁ డెవ్వం డో! మనవాక్యంబునకుం బ్రతివాక్యం బిచ్చినవాఁ డతండు గా వచ్చు నని మది సంతసం బొందు చుండె. నీ వేగి యాతనివృత్తం బరసి ర' మ్మని యనిచిన నది బాహుకుం జేరం జని 'ఓయీ! దమయంతి నీ క్షేమం బడుగు

మనియె. ఇందుల కేలవచ్చితి' నన 'రథంబు నొక్కనాఁట ఋతుపర్ణుఁడు విదర్భాపురంబునకు నడుపు మన నూఱామడ త్రోవ నడపితి. ఆనరేంద్రు రథచోదకుండ' నన నక్కేశిని మరల మూఁడవవాఁ డెవ్వఁ డన వార్ష్ణేయుం డని చెప్పిన నాతండు నలుజాడ యెఱుంగునో యన వార్ష్ణేయుండు నలాపత్యంబులం గుండినంబున నుంచి ఋతుపర్ణుకొల్వు సేయుచుండె. ఆతం డెల్లెఱుంగు' నన మరల నక్కేశిని యిట్లనియె.

"నిద్రాపరవశ యై యున్న దమయంతివస్త్రంబుం గోసి యన్నలుండు చన్న నన్నలినాక్షి తదేకవస్త్ర యై మలినగాత్రియై ధాత్రీతలంబు శయ్యగా నుండె" అన నశ్రుపూర్ణనయనయునుం డై పెఱవలనిం జూచు చుండ నద్దియు నత్తెఱంగు వైదర్భికిం దెలిపిన నలుం గా నెంచి "యోకేశినీ! అతఁడు ఋతుపర్ణు నౌదనికుం డని విందు. మరల నాతనివర్తనం బెఱింగి రమ్మ" నిన నది యేగి మరల వచ్చి యత్తలోదరితో ని ట్లనియె. "ఆతండు దేవుండో కారణజన్ముండో సిద్ధుండో కావలయు. అతనిచరిత్రం బతివిస్మయకరంబు. వంటకం గడంగునప్పు డాతం డింధనంబు లపేక్షింపఁడు. వహ్నిఁ దెచ్చుట లేదు. తృణపూలకంబు చేతం బూని వైవ నది మండుచుం బాకం బగునంతకు న ట్లయుండు. రందనంబునకై పూనినకుంభంబు లెల్ల జలపూర్ణంబు లై యుండు. పుష్పంబు లాతనికరద్వయంబున నలంగి యుం దావి విడక వాడక యుండు. ఆతఁడు దైవసమానుం" డన నద్దమయంతి యాతండు వండినమాంస

ఖండంబులం దెప్పించి యాస్వాదించి తప్పక యాతండు నలుం
డని నిశ్చయించి యంతట నూఱడిల్లక తనకొడుకుం గూఁతు
నక్కేశినిచే నాతనిచెంతకుం బనిచినం జంద్రోదయంబునం
గడలిచందంబున దద్దర్శనంబునం గన్నీరు మున్నీరై పాఱ
నాఁపం జాలక ప్రావృట్కాలంబునం గదంబంబునఁ గుసుమం
బులుం బోలె మేన నెల్లం బులకాంకురంబు లావిర్భవింప
నయ్యపత్యద్వయంబుం జేరం దీసి కవుంగిలించుకొని తనకురు
వునం దుంచుకొని యక్కేశినిం జూచి యిక్కుమారులు నాయ
పత్యంబులం బోలి యుండుట వీరల నెత్తుకొంటి నని తన్ను
స్ఫుటీకరింపక వచించి మరల నిట్లనియె. "ఓయింతీ! మే మన్య
దేశంబుననుండి వచ్చిన బ్రాహ్మణులము. నీకు నస్మత్సాధ్యం
బగు కర్జం బేమి గలదు? ఎద్ది యేని యుండిన మహారాజుతో
నుండ వచ్చుఁ గాక తద్భృత్యుండ నే నెంతవాఁడ? పలుమఱు
నాచెంత కీవు వచ్చుచుం బోవు చుంట నాలోకించిన మను
ష్యులు వేఱుగా నెంతురు. మనయంతఃకరణంబులు శుద్ధంబు
లైన నే మందు రన వలదు. అంతఃకరణంబులం బ్రవేశించి
జూచువారు లేరు గదా! వర్తనంబె మనుజులకుం గీర్త్యపకీర్తులం
దెచ్చు. తాళవృక్షంబుకడ క్షీరపానం బొనర్చిన మధుపానం బ
చేసె నండ్రు. ముసిఁడిపండు పచ్చనై యతిరుచ్యం బనితోఁచు.
పుట్టినదుర్యశంబు మరలింపం దగువార లెవ్వరును లేరు.
పొమ్ము." అనిన నక్కేశిని యావృత్తాంతంబు రాజపుత్రికిం
జెప్పిన నాదమయంతి యాతఁడు తప్పక నలుం డని నిశ్చ

యించె. ఔరా! నారులకుఁ దోఁపనియుపాయంబు లెందుఁ
గలవె? వారు సహజబుద్ధిసంపన్నలు. రూపంబునఁ గాని వర్త
నంబునఁ గాని మాటలవలనఁ గాని యించుకయుఁ దెలియఁ
బడక యతిమాత్రచ్ఛన్నుండైన యాతని యింగితము లారసి
సత్యరూపముఁ గాంచె. మఱియు నెవ్వని కేని ప్రయత్నమున
సాధ్యంబులు గాని కార్యములుఁ గలవే? అత్తెఱంగున నద్దమ
యంతి నిశ్చయించి 'ఓ కేశిని! నే నాతనికడ కేఁగి వచ్చునో
యాతఁ డిందులకు రా వచ్చునో మాతండ్రియనుమతిఁ గొని
ర'మ్మని తన్నిదేశమున నాతని రప్పించె.

అప్పు డద్దంపతుల కన్యోన్యదర్శనంబు మనంబుల
యం దెద్దియో యగమ్యంబు నవచనీయంబు నగు నవస్థఁ
బొందించె. ఇరువురకుఁ గన్నీరు కొంతదడవు వెచ్చనై కొంత
దడవు చల్లనై తొరఁగె. నలుఁడు పాంసుదిగ్ధగాత్రియు నాత్మ
ఖండితచేలార్ధధారిణియు నిరంతరాశ్రుధారాప్రవాహక్షాళితర
జోదృశ్యమానరేఖా సమలంకృతగండపాళికయు మితాహార
కృశీభూతధవళమ్లానగాత్రవల్లికయు ననతిస్పష్టోచ్చార్యమాణ
దంత్యాక్షరానుమేయనలనామయు ద్వితీయాచంద్రరేఖయుఁ
బోలెఁ గృశించియు లావణ్యశేషయైనదియు నలంకారశూన్య
యయ్యు నైజసౌందర్యమాత్రవిభూషితయు సంస్కారశూన్య
త్వంబున వికలమూర్ధజయు నై యున్న యద్దమయంతిఁ జూచి
ధీరోదాత్తుండు గావునఁ గొంతదడవునకుఁ గన్నీరు స్తంభించి
చూచుచుండె. దమయంతి యాతని వికృతవిగ్రహం బారసి

యన్యుం డని తలంపక వినయభయలజ్జాసమాక్రాంతచిత్త యై శిరంబు వంచి మెల్లన నిట్లనియె. "మహాత్మా! అట్లు వివిక్తం బైన ఘోరగహనంబున నధ్వాయాసంబున మై మఱచి నిద్రించుచున్న యబలం జూచి యన్యులైనం గనికరింతురు. కృపావదగ్రగణ్యుండు ననురక్తుండు నగు నలుం బోలె నాత్మైకాయత్తజీవితయు నగ్నిసన్నిధి యథానిధ్యాతయు సాధ్వియు ననపాయవృత్తియు నగు నబల నుజ్జగించి పోవువార లెవ్వరు లేరు గదా. నాస్వయంవరంబునాఁడు తనరాయబారమున దివిజవరులు నన్నుం గోర వారలఁ గాదని తన్ను వరించిన నదానిం బుత్త్రవతి నెన్నం డేని నొకయపరాధం బొనర్పనిదాని న్నిట్లు విడువ నెట్టియపరాధంబు నేఁటి కొనరించితి నో! అది యింతశిక్ష సేయం దగినంత యగునే? అది య ట్లుండ ని న్నెన్నండును విడువం జాల నని నాకడం బలికిన వాక్యంబు లసత్యములు గా వచ్చునో" యని వార్షికకాదంబిని యుం బోలె బాష్పవారిధారలు గురియుచున్న యాధర్మపత్నిం జూచి నలుం డంతరంగము గరఁగ ధైర్యము గడకొత్తి కన్నీరు విడుచుచు నిట్లనియె. "తన్వీ! నీ వెన్ని యన్నం బాత్రుండ. అక్కాలమున నీ నలుండఁ గాను. అట్లు గానిచోఁ బ్రాణములైనం బరిత్యజింప నగుం గాని నను విడఁ జాలక కర్కశారణ్యముల నీడయుం బోలె విడక యనువ్రత యయిననీ యట్టి ప్రేయసి విడ నగునే? కలిసమావేశమున న ట్లొనర్చితి. అతం డకారణంబ న న్నావేశించి యింతవంతలం బెట్టె.

దుష్టుల కన్యశ్రేయములం జూచి యోర్వఁజాలమి య తక్కఁ
బెఱవారి నిక్కట్లం బెట్టం గారణము గల దే? అందువలన
వారికిం జేకూరులాభము నొందు లే దనుట వారికిం దెల్ల మై
యుండు. అ ట్లెఱింగియుం బరుల నిడుమలం బెట్టుట యె వారి
లక్షణంబు. అట్లు కానినాఁడు సుజనదుర్జనభేదమును లేదు.
మఱియు నిట్టిదుర్జను లున్న యెడ సుజనులసౌజన్యము స్పష్టం
బగును. ధవళచేలమున నించుక మసిచుక్క యంటిన నా
ధావళ్యం బతి విస్తారం బై తోఁచు. కావున సుజనులకు గుణ
ప్రకటన ద్వారమున దుష్టులు నుపకారుల కాని యపకారులు
గారు.

"ఓలతాంగీ! న న్నింక దూఱ వలదు. పుణ్యావశంబున
మరల దుష్కృతంబు వాసె. మనుజులకు సుఖదుఃఖంబులు
వృక్షంబులవలెఁ గాలవశంబున ఫలించు చుండు. చేసిన సుకృత
దుష్కృతముల ఫలము లవసానకాలంబున నించుక హెచ్చు
గాని యించుక తక్కువ గాని కా నేరవు. తాఁ జేసినది యను
భవించునపు డొరులు దీనికిఁ గారణ మని యెంచుట యెఱుం
గమి. ఇందుఁ గలిం దూషించుట కూడదు. ఓరాజపుత్త్రి!
నీ కై యే నిందు వచ్చితి. ఇంతికి నొక్కండ మగం డని
ధర్మజ్ఞులు చెప్పు చుందురు. అది య ట్లుండ నీ వాధర్మంబుఁ
బాటి నేయక పునస్స్వయంవరంబు నేయం దలంపుఁ గొని యెల్ల
రాజుల రావించుట ధర్మంబే? సాధ్వి యనం బే రొందినదానవు.
ఉత్తమవంశసంభూతవు. కర్మవశంబున నించుక యిక్కట్టు

వచ్చిన నంతలో నెవ్వరుం ద్రొక్కనిత్రోవ యిట్లు త్రొక్కుట యేటిధర్మువు! సత్కులప్రసూత లయినమానినులిట్టియసత్పథంబునం జరించిన నన్యులకుం గూడ నది దుర్మార్గంబు గాదె? తుచ్ఛసుఖముల కై యిహపరములకుం దూర మగుదురే? అనిత్యములైన యీసుఖములు త్రుటిమాత్రమునం జెడును గాని యపయశంబు బ్రహ్మకంబై నధికాయువుగలది. భూతలమునం గీర్తి గలిగినంత కాలము పరలోకసౌఖ్యము నపయశ మున్నంతకాలము పరలోకదుఃఖముం గలుగునందురు. నీ స్వయంవరమున కై ఋతుపర్ణుండు వచ్చుటం జేసి కదా నే నిందుల కాతనితో వచ్చితి." అనిన విని దమయంతి లజ్జాభయములు మల్లడి గొన మస్తకం బించుక వంచి బద్ధాంజలియై యిట్లనియె. "ప్రాణనాథా! ఇందుం గలసత్యముం జెప్పెద జిత్తగింపుము. నే నీచే నట్లు ఘోరదుర్గమం బైనసాంద్రారణ్యమునం బరిత్యక్తనై పరిభ్రమించి యొక్క సార్థవాహసార్థముతోఁ గరిఘటాజనితం బైన యుపద్రవమునకుం దప్పి చేదిపురముం బ్రవేశించి యందు రాజమాత్రాదరమునం గొంతకాలం బుండి మాయయ్య నన్ను నెమకింప నిందులకుం దెచ్చినసుదేవుండనువిప్రుని నీకై పుచ్చితి. ఆతనికిం బ్రత్యుత్తరంబిచ్చువాఁడు నలుండ కాకయెవ్వం డుండుననునిశ్చయమున నెల్లి స్వయంవరంబని ఋతుపర్ణునొద్దం జెప్పించి యొక్కనాఁటికి శతయోజనపదవిం

దేరు నడపువాఁ డీవు దక్క నొరుం డుండఁ డని నిశ్చయించితి. నీ విందులకు గాఁ గల వనునిశ్చయంబున నింత పన్నికం గావించితి. ఇది యసత్యం బని నీమదిఁ దోఁచె నేని నిన్నగరంబునకు స్వయంవరార్థం బై ఋతుపర్ణుఁడు దక్క నొక్క రాజయిన రా కుండఁ గతం బేమి? నాశీలంబును దావకీనమానసంబునకుం గోచరింపనిది గాదు. నే నిట్టిదుశ్శీల నైతి నేని సకలసదసత్కర్మ సాక్షు లగుసూర్యచంద్రాగ్న్యనిలదివిజులు వేల్మిడిం బరిగొన కుందురే? ఓ సురేంద్రులారా, నాయం దించుక దోషం బుండె నే నీక్షణంబ భస్మావశేషం గావింపుఁడు. మనోవాక్కాయకర్మంబుల నలుం గాని యన్యు నెన్నండుం గోర. మీ రెల్లవారిమనోగతంబుఁ దెలియుదురు. మిముం గను మొఱంగి యెవ్వాఁడు నించుక విచేష్టితంబుఁ జేయం జాలఁడు గదా! ఈరాజోత్తమున కీసంశయంబు దీఱనినాఁ డగ్ని ప్రవేశం బగుదుం గాక" యని యాసతీవతంసంబు హస్తద్వయంబు దోయిలించిన నంత సర్వజంతువులకుం బ్రాణభూతుండు యంతర్యామి యగువాయుదేవుం డందలివా రెల్ల విన నాకసంబున నుండి యి ట్లనియె.

"ఓ నిషధేశ్వరా! ఈ సాధ్వీమణి ని ట్లాడం దగునే? ఇమ్మానినిం బెడఁబాయక సూర్యచంద్రములు నేముం గాచుచుంటిమి. స్వప్నముననైనం బెఱవానిం దలంపదు. అగ్గికిం జెద

లున్నట్టునే? నన్నుగ్రతయం జేము నీకు యీ సుచరిత్రం గాచు చుంటిమి. ఈ సుశీల యెల్లవారికి వందనీయయు భవదేకాయత్తమనోనురాగయుఁ గావున నింకఁ యేని సంశయింపక యిమ్మెచ్చుబోఁడిం జేకొను" మనిరి. అంత సురభిగంధసాంద్రంబు లగుపారిజాతసుమంబు లాకసమున నుండి వర్షించె. సురదుందుభిస్వానంబు వ్యోమమార్గంబు బోరన మ్రోసె. భూమిజనంబు లెల్ల సద్దమయంతీసుశీలంబున కచ్చెరు వడి పలు దెఱంగులఁ దచ్చరిత్రంబులు నుతింప సాగిరి. వైదర్భుండుం దత్కుటుంబినియుం దత్సుత బాంధవాదులు నతిసంతుష్టాంతరంగు లై వారల నభినందించిరి. అయ్యవసరంబున నలుండతిసమ్మోదరసపరిపూర్ణహృదయుండై కర్కోటకుఁ డొసకిచ్చినరీతి నాతనిం దలంచుడుం బతత్త్రిరూపపాశకహృతంబైన చేలంబు సన్నిహితం బైన దానిం బూని యంగవైరూప్యం బెడలి తొల్లింటియట్ల కందర్పశతసన్నిభం బగు నిజరామణీయకంబుం బూని తేజరిల్లె. ఇట్లియ్యిరువురుం బరస్పరయోగంబున రాజిల్లి మనస్తాపంబులు విడిచినం జూచి భీముండు సంపూర్ణమనఃకాముం డై పురం బెల్ల నయ్యుత్సవంబుఁ జాటించి మహామహంబు నడపించె. అంత నాఋతుపర్ణుండు నలుం జేరం జని ముకుళితకరకమలుం డై వడంకుచు "ఓరవితేజా! నిఖిలలోకైకపూజ్యుండ వైనచక్రవర్తిముఖ్యు నిన్ను నెఱుంగమిం జేసి యనర్ఘం బగువజ్రశకలంబుం గిరీటంబునం

దాల్పం దగుదానిఁ బాదపీఠంబునం గూర్చుచాడ్పునం ద్వాద వర్షంబు లగునీచవ్యాపారంబులు నియోగించితి. ఇట్టినేరమికి సైఁపుము. నీవు బాహుకనామంబున నుండియు నమానుషము లయినసామర్థ్యములు చూపుచుంటి, నైన నిన్ను నలుం డని తెలియకుండిన నుండ నిమ్మెవ్వం డో మహానుభావుం డని యైన నిరూపింపఁ జాల నైతి. నా బుద్ధిజాడ్యంబున కపు డే మని చింతించువాఁడ." అని పరితపించుచున్నవాని నలుండు "అయ్యా! ఇంత చింతింపం బని యేమి? నా కీ దుర్దశాకాలంబునఁ దలదాఁచుటకు నను వైనతావు నీకడ నొదవె. అందుండి దీని నిస్తరించితిం గాన నీవు నాకు మహోపకారం బొనరించితివి. నీయుపకారంబున కిలం బ్రత్యుపకారం బొనరింపఁ జాల. ఇది యిట్లుండం బరితాపం బేల చెందెదవు?" అని సమ్మానించి యనిచె.

---

# కుశలవుల చరిత్రము

———:o:———

శ్రీరామచంద్రుండు సకలప్రజారంజకంబుగాఁ జిరకాలంబు రాజ్యంబు పాలించి "అవశ్యంపితురాచారమ్" అనునట్లు చిత్తంబునఁ బుత్రకాంక్ష చిగురొత్తఁ బుత్త్రప్రాప్తికిం గాలంబు వేచి యుండెను.

అంతఁ గొంతకాలంబునకు నాతనికాంక్షాపరిపూర్తికి సూచకంబుగా జనవీప్రవాసలగ్నంబున భూసుతకు గర్భంబు నిలిచె. ఆచిహ్నం బెఱింగి రామచంద్రుండు రాకాచంద్రునట్లు వికాసభాసురముఖబింబుండయి యానందాంబుధి నోలలాడుచుండెను. అట్టియెడ నొక్కనాఁడు నడురే యేకాంతగృహంబున హంసతూలికాతల్పంబున సుఖశయనుండై నిద్రించుచు, రాఘవుండు జానకిం బూనికి మీఱ నివసన్మునిజాలం బగు గంగాకూల వనాంతరంబున డించి రా నంచితగుణలక్ష్మణుం డగులక్ష్మణుం బంచినట్లు కలగని, కలగొన్నమనంబుతో లేచి నలువలంకులఁ గలయం బరికించి వెఱపు మఱపు నెఱుంగక పఱపునం గుఱుపెట్టి నిమురించునిల్లాలి నల్ల నవలోకించి, కించిన్నిమీలితనయనుండై యాలోచించి, మంచిది యాచంచలాక్షి మేలుకొనునంతకు నిదానించి పదంపడి యెదం గల

కోరిక యడిగి తెలిసికొని యది తీర్చి మనంబు నుడుకార్చెద
నని తలపోయుచుండెను. ఇంతలో సీతయు మేలుకాంచి శయ్యా
తలంబున వెచ్చ నూర్చుచుఁ గూర్చున్న ప్రియు నవలోకించి
యిది యేమి యని యనుమానించుచు, "ప్రాణేశా! ఈ నిశీథ
సమయంబున శయనంబు మాని యిట్లుండ నేల? ఈయునికి
చూడ నెంచరానివగపు దనికినచందం బగపడియెడిని. అట్టి
వగపునకుఁ గతంబెయ్యదియో తెలుపఁ దగునేనిం దెలుపఁ
గోరెద." అనవుడు నతండు తనమనంబుతుందుడుకు లో
నడఁచుకొని మొగంబున వెడనగ వంకురింప నమ్మగువ
కిట్లనియె.

"జానకీ నీకుఁ దెలుపరానిదియు నొకటి గలదా? కల
తెఱం గెఱింగించెద వినుము. ఎందేనియుఁ బతియగువాఁడు
పత్ని యంతర్వృత్తి యగునేని యాక న్నెఱిఁగి తన్నాత్న
వాంఛితం బతిప్రయత్నంబునం దీర్చి ప్రియం బొసర్చుట పరమ
ధర్మంబు. అది యెఱింగియు నీయపేక్ష యూరయక యుపే
క్షాపరుండనై యూరక కాలక్షేపంబు చేయుచున్న వాఁడ.
ఇది నాకుఁ దగ వగునా? ఎల్లవారికిఁ దగవులు దీర్చువాఁడనై
యుండియు నాతగవు నే నెఱుంగ నైతినే యని నాలో నే నిట్లు
విచారించు చున్నాఁడ. కావున నీవు నీవాంఛితం బేయది యని
యీయాయుదనున దాఁపక తెలుపు దేని దాని నొడఁగూర్చి నా
కొఱంత దీర్చుకొనియెద." అని ప్రియంబు దొలఁకాడ నాడు
ప్రియునిమాటలు పాటిగా నెన్ని యాయన్నులమిన్న కన్ను

దమ్ముల నానందాశ్రులు జలజల గాలఁ జాలఁ దమకంబున "అఖిలమునులకు సుఖనివాసం బై లేడిదూడ లాఁకొనం గని కనికరంబునం బాలిచ్చి లాలించు బెబ్బులికొదమలచేతను, బెబ్బులికొదమ లెదవడ నద నరసి యొరయిడి సోదరిండ్లం జేర్చి యూరార్చు పిడియేనుఁగులచేతను, ఏనుంగుగున్నలం గూడి వేడుకలు మీఱ నాటలాడ వేఁడుసింగంబులచేతను, సింగపుఁ గూనలఁ గానలం దిరిగి బడలనీక తమవీఁపులనిడి మోచి తెచ్చి దచ్చికాళ్ళమెకంబులచేతను, మనంబునకు వెఱఁ గొనర్చుచు నొప్పారు భాగీరథీతీరారణ్యపుణ్యాశ్రమంబుల మునిపత్నులం గూడి మెలంగి యాడ మనసయ్యెడిని. అది యొడఁగూడఁ జేయుఁడి" అని విన్నవించెను.

అది విని రాఘవుండు తనకన్నకలయు, నాయన్నులతల మిన్న తలఁపును, ఒక్కటయి యున్నదని కొండొక విచారించి యాకొరిక నెఱవేర్పఁ బ్రియంబుమెయి నియ్యకొనినవాఁడునుం బోలె నభినయించుచు "కలికీ నీయభిమతం బొడఁగూర్ప నిప్పుడ ప్రయత్నంబుచేసెద. రేపు రేపకడన పయనంబు తూఁగింతువుగాక" అని నమ్మఁ బలికి యమ్ముద్దుగుమ్మ నెప్పటియట్ల శయనింప నియమించి తా నందు నిలువక యభ్యంతరమందిరంబునకు నచ్చి యచ్చటికి భద్రమధుమత్త కాశ్యపప్రముఖు లగు నర్మసఖుల రావించి భద్రు నభిముఖుం గావించుకొని "పౌరు లెవ్వరేని నావలని నేరము లారసి దూఱంగా విని యుందువేని మోమోడక బొంకాడక కలది

కలయట్లు తెలుపుము" అని యడిగిన, వాఁడు "రాఘవా నీవె సర్వాఘనదీనిదాఘమూర్తివి. ప్రాణిజాత హృదంతర్వర్తివి. భక్తకామితఫలదాతవు. శరణాగతత్రాతవు. విగతకల్మషుండవు. శయనీకృత శేషుండవు. నీదివ్య తెన్ను నెన్నని గలవు నిన్నెన్నువా రెవ్వారు? ఎల్లవారు "గురువాసతి విరసా వహించి, అశవ్యుం బ్రాపించి, ఆదరి మునులకొందలంబుం దొలంచి, దండకాటవిని ఖరప్రముఖరాక్షసుల యసువులు గొని, సుగ్రీవుని చెలిమి గని, లవణార్ణవంబు గట్టి, రావణాదులం గిట్టించి, సీతం జేపట్టినట్టి కౌసల్యపట్టికి సాటియెవరు" అని యెంతును నీపవిత్రచరిత్రంబు చిత్రంబుంగా నెంచుచుందురు. ఇంతియకాని నీవలన నెవ్వరు నేకొంతయు నాపాదింపరు. మఱియు "సురాసురులకు నజయ్యు లగునసురవరుల నురంబున నెదిరించి తుదముట్టింపను, నిరుపమానబలశాలి యగు వాలి నొక్కకోలం గూలనేయను, నరులవలననుం బోలె వానరులవలనఁ బనులు గొనను, పరుషతరనిజశరాగ్రంబున శరనిధిశరంబు సర్వంబు నాకర్షింపను సంకర్షణమూర్తి యగు శ్రీరామమూర్తికిఁ గాక సామాన్యరాజన్యులకు నలవి యగునే? ఈతఁ డాపరమధాముండు గాని యొరుండు గాఁడని పౌరు లెల్ల బౌరులువీరి యాడుకొన వినుచుందుము" అని విన్నవించెను. అది యంతయు వినియు నాభద్రాత్మకుండు "భద్రా! నీవచించినభద్రవాక్కు లెల్ల నామనంబున కెక్కెను. అయినను లోకు లొకరి నెంచునప్పుడు పలువురు పలుదెఱఁ

గుల నాడుకొందురుగాని యందఱొక్కతీరుగ నాడుకొనరు. కొందఱు సుగుణంబుల ననువదింప మఱికొందఱు దుర్గుణంబుల నాపాదించుచుందురు. ఇది ప్రకృతులకుఁ బ్రకృతిసిద్ధంబు. కావున నీ వింక స్తుతి పాఠంబులకుం దొడంగక విన్నది విన్నట్లు చెప్పుము. దాన నేనియుఁ గొంచెమును బాటిల్లదు." నావుడు భద్రుండను విప్రముఖ్యుండు "ఓ సర్వభూపశ్రేష్ఠ! నీవంటివాఁ డిట్ల డుగఁ గలిగినది నిట్లు చెప్పెదమతి. అయినను గురు వులవలననేనియు నెరసులై వెదకుపడఁబోతు లాడుకొను మాటలు పాటింపఁబోలదని వానిమాని మానసీయోక్తులె నీచెవి నానించితి. తక్కినవాని వినఁగోర నేల? నీతిదూరుండగు దుర్బుద్ధులు పలినవాఁడు దయాంబుపగునే నితండు కడు మెత్తనివాఁడు. ఇట్టిదొర నెవరు మెత్తురంచురు. మెత్తనకయెత్తజి నేనెవరినేనియు నేరంబుకొలఁది విచారించి దండించువాఁ డయ్యెనే నితండు కడు నిర్దయుండు, ఇట్టి కఠినులెందుఁ గల రందురు. ధైర్యసారుండై గాంభీర్యంబు మెయి కార్యంబు నడుపువాఁడే నితండు పరు వరసి మఱియూద సేయువెరవు గానఁడు, కడుగర్వి యందురు సర్వసముఁడయ్యు దుష్టశిక్షయు శిష్టరక్షయుఁ బూని యొనరించువాఁ డవునే నితండు పక్షపాతి, లాఁతివారిమేలు గని యోరువ నేరం డందురు. ఏవంవిధగుణగ్రాహులగు పామరులు భూమీశులవలని గుణదోషంబు లెఱుంగ నేపాటివారు. పాటించి విన వారిమాట లేపాటివి. వానినే మీరు వినఁ గోరునెడ వినిపింపక పోవ నే నేపాటివాఁడను. కొంద ఱవినీ

తఁలు కీడు మేలెఱుఁగక యేకళంకము నెఱుఁగని మిత్రాన్వయం
బున జనియించియు మనధరాకళత్రుండు కళత్రవాంఛాపరుం
డై దోషం బనక దోషాచరపరిగృహీత యగు సీతం గొని
వచ్చి రోఁత పడక యేలుకొనుచున్న వాఁడు. 'యథా రాజా
తథా ప్రజా' యన్నట్టు లెవ్వరేనియుఁ బరులు చెఱగొన్న
యన్నులం బలిమిఁ గొని వచ్చి మరులు హెచ్చి యేలుకొన్నఁ
గా దనరాదందురు. మఱి యీ పురంబునఁ గాపురం బుండు
చాకిత యొకత మగనిచే దండిత యై యలువాసి పుట్టినింటికిం
జన నా వృత్తాంతం బద్దాసితండ్రి యెఱింగి తీండ్రించురోషంబున
'కూతురా! ఏతఱినేని యిట్టి యల్లరిపనులకుఁ జొచ్చుట
యిల్లాండ్రకుఁ జెల్లునా? ఎల్లవారిమయిలలు దొలఁచి మడుఁ
గుల గావించునా పంగడంబు మైలపడ నేల యిటు వచ్చితివి?'
అని తూలనాడ యానాలవనాఁడ తోడుకొని పోయి యల్లుని
యిల్లు సేర్ప నాధావకుం డావంతయు శంక లేక 'యిల్లు వెడలి
పోయిన యిల్లాలి నేలుకొన నే రామభూపాలుఁడఁ గాను పో
పొమ్ము' అని పెఱుగ నాడెను. అది విని ముదిచాకలి చేయు
నది లేక కూఁతుం దోడుకొని తన యునికిపట్టునకుఁ జనియెను.
మఱికొక లుదికి కడుపువోసికొను నల్పుల కంతకంటె మేలి
పోలిక యెట్లు గానవచ్చు." అని పలికి యారజకుని దూఱం
దొడంగినభద్రు వారించి, శ్రీరామభద్రుండు మధుమత్తాదుల
నవలోకించి 'మీరలు నప్పుడప్పు డిదియంతయు వినుచునె
యుందురుగద, కొద వెవరిది?" అని యడిగెను. అందులకు

మా కేమి చెప్పను నోరుగాక వారు తలలు వాంచి యూరక యుండిరి. అప్పుడు రామచంద్రుండు చంద్రునందలికళంకమునుం బోలెఁ దనయందు నింద పొందెనని యింతంతన రానిసంతాపం బంతరంగంబున దొంతరలుగొనఁ గొంతవడి చిత్రప్రతిమ యట్టు లిట్టునట్టుఁ గదలక యుండి పదంపడి చేతన వహించి కంచుకి నొక్కనిం బిలిపించి "నీ విప్పుడ పోయి నాయనుఁగుఁ దమ్ముల రమ్మంటి నని చెప్పి తోడుకొనిరమ్ము" నావుడును వాఁడు నిదురమబ్బునం దడఁబడుచుఁ గడు రభసంబున భరతాదులనివాసంబులకు నరిగి యేలినవాని యానతి యా నీతి పరుల కెఱింగింప నమ్మువ్వురు నొక్కయెడఁ గూడుకొని యిది యేమి? వేళగానివేళ మనల జననాయకుండు రాఁ బనిచె నని విచారించుచు వేగవచ్చి వెచ్చనూర్చుచు మొగంబు వాంచి విన్ననై యున్నయన్నం గాంచి సంచలితస్వాంతులై వెఱఁగును దొట్రుపాటును మిక్కుటంబుగా గడగడ వడంకుచు నాతని యడుగుల కెఱఁగి కేలెఱఁగట నిలువంబడి తమ్ముఁ బిలువఁ బంపుటకుఁ గారణం బడుగనోడి యుదాంతం బరయ వేఁడి యున్న తమ్ములవలనికిఁ జూడ్కులు నిగిడించి, "అన్నలారా! రండు కూర్చుండుడు." అని లోకరక్షణప్రశస్తం బగు తన దక్షిణహస్తంబునఁ దన్నుఁ జేరవచ్చినవారి మేనులు నిమిరి కౌఁగిటం జేర్చి నిట్టూర్చుచు గద్గదస్వరంబున నిట్లనియె.

"తమ్ములారా! మీ రరమర లేక భూభరణంబునకు నన్ను నెలకొల్పి యనల్పభక్తి యుక్తి నాకుఁ జుట్టంబులుఁ

బక్కంబులుఁ జెలులు సచివులు నై యుచితవృత్తి ననువర్తించి మెలంగు చున్నారు. నాప్రాణమానధనంబులు మీరె యై యుండ నేనొండ నేపని చేయవలసినను మీకుఁ దెలుపక చేయ నెట్లువచ్చు? మీకును లోకంబునకును హితంబు పొంటె నొక్కకడిందిపని సేయం దలకొంటి. ఎట్టివారి కేనియు నప దూఱు కొఱగాదుగదా? బుద్ధిమంతు లగువారు జాగరూకు లై యద్దానిఁ జేరనీక తప్పించుకొని మెలంగుచుందురు. ఇప్పుడు ప్రమాదవశంబున నయ్యది నన్నుఁ జెందె. ఇఁక దానిఁ దలఁగు వెరవు వెదకుట యుక్తము. కావున నాకిప్పు డొదవిన యపవాదంబును దానిఁ దలఁగ నేఁ జేయఁ దలఁచినయుపా యంబును దెలిపెద వినుండు. పౌరులెల్ల 'పరదారా పహారపరాయణుండైన దానవేంద్రుచే నపహృతయై యేడుకాలం బాతనియింటనున్న సీతను పూతచరిత్రయనిరోఁత పడక కొనివచ్చి మనయేలిక యేలుకొనుచున్న వాఁడు. ఈతం డతికాముకుండు. కాముకునకు నేమునంబునకుఁ గడుదవ్వుగాదె. ఱేఁడు పాడిదప్పినను గావను వారెవ్వరు.' అని యిట్లు పెక్కు చందంబుల నన్ను నిందించు చున్నారు. మఱియుఁ గొందఱు మొఱకులు కలుషదనంబున 'ఎవ్వరేని తమ తెఱవలఁ జెఱ గొన్నఁ దగు సహాయం బలవరించుకొని వారలఁ బరిమార్చి నారులఁ గొనివచ్చియే యనుమానంబును లేక యేలుకొన వచ్చునని రాఘవుండు వగదెంచెను.' అని యాడుకొనియెద రఁట" అని లక్ష్మణుం జూచి "సౌమిత్రీ రావణవధానంతరము

బ్రహ్మరుద్రేంద్రాంది దేవతావల్లభు లెల్ల సీత పూతచారిత్ర,
అనుమానంబు మాని యేలుకొమ్మన్న నేనయ్యన్న నొల్ల నన
లేదా? దానికి దానవారివర్గం బెల్లనొ నన జానకి తన పావనత
వెల్లడిగా నగ్నిం బ్రవేశింప లేదా? అప్పు డగ్నిహోత్రుండు
'ధాత్రీశా యీపద్మనేత్ర పరమపవిత్ర కైకొమ్ము' అని చెప్పి
యొప్పింపలేదా? ఇయ్యగ్ని దేవుం డాన తిచ్చు మాటలు
నిక్కువంబునమ్ముమునమ్ముమనివియచ్చరసముచ్చయంబుతోడ
వచ్చి దశరథేశ్వరుం డానతియ్య లేదా? తొలుతం దులువ
యగు దశకంధరుం జంపినందులకు సిలింపు లిచ్చుకంబు లాడెద
రని వారిపలుకు లాదరింపక పదంపడి త్రిదశగణంబులతోడ
వచ్చి దశరథేశ్వరుండు నల్లె యానతిచ్చుటం జేసి జనకుని
పనుపు మనకుం గరణీయం బని ధరణిజం గై కొనుట
నీవెఱుంగవా? ఇది యేదియు విచారింపక విచార
దూరులై పౌరు లూరక నన్ను దూఱు చున్నవారు. ఇది
యేటివిచారం బీపామరులమాటలు మనము పాటింపరా దందు
వేని పండితు లిట్టివి తలంపనే తలంపరు. కీర్తి యేనియు నపకీర్తి
యేనియు సామాన్యజనులవలనన విస్తరిల్లు చుండుం గావున
విష్ణుతామరసనిలయద్వారం బగునుదారయశంబు గోరువారు
పాయరానిప్రియబాంధవుల నెడంబాసియేనియుం బ్రకృతిజనం
బులమనంబులకు నెక్కు మెలంగి యపయశంబుం బాపుకొనం
జూతురు. కాంబట్టి నే నిప్పట్టున నీరట్టు వాయం జూలా లని
యు గోల యనియుం దలపోయక జాయం బాయం దలంచితి.

అంగుళీయ మిదియ యదనై యున్నయది. అది యెట్లు లన్న పుడమిపట్టి తనకు భాగీరథీపరిసరారణ్య పుణ్యాశ్రమంబులఁ దత్పత్నులం గూడి మెలంగి యాడువాంఛ కలదని నుడివెను. అది మిషగా నయ్యనిమిషేక్షణ విడనాడి తోడరినయవసడిఁ బోనాడెద" అని యానతిచ్చ్యమానవపాలుపలుకులు చెవులం గొఱపుటు సోఁక నాఁకగొన రానికినుక పొడమి సౌమిత్రి మహోదగ్రమూర్తియై లేచి నిలువంబడి బొమలు ముడివడఁ బలుకులు తడఁబడ, "అన్నా! మావదినెవలన దోషంబు లెన్ను పాపంపుల నిమేషమాత్రంబున మదీయరోషపావకున కాహుతి చేయ నూహింపక యూయమ నట్టడవులం ద్రోయఁ దలపెట్టు టన్యాయంబు. పెరతలఁపులు గట్టిపెట్టి నన్నా దురాత్ముల మట్టుపెట్టఁ గట్టడ సేయుము. నీతిదూరుల దోరింపక నారీమణిం గారుగోన పాలు సేయుట యెలుకలరాయిడికిం గనలి యింటఁ జిచ్చిడుకొనుట." అని విజృంభించి పలుకుచున్నలక్ష్మణునిపలుకుల కలరి భరత శత్రుఘ్నులు, "ఔనౌను పగవారు నగ నసుఁగులు వగవ మగువ విడనాడఁ దెగుట తగవు గాదు" అనిరి. ఎవ రేమి చెప్పినను నరపాలుం డాలింపక యాలంబు సేసి తనవూనికి నెఱపుతలఁపున, "అన్నలారా! మీ రింక నాకు మాఱాడుదు రేని నాయాన సుఁడీ," అనెను. అది మదపుటేనుఁగు నంకుశంబునుం బోలెఁ దన్నుఁ గుదియింప నాఁటోపంబు దక్కి లక్ష్మణుం డొక్కెడ నొదిఁగిలి యుండె. భరతశత్రుఘ్న

లున్మాదలగ్నగంధేభంబులుంబోలె భగ్నాశయులై యూర
కుండిరి. పదపడి పుడమిపతి యూర్మిళాపతిం జూచి "సౌమిత్రీ
యేల నీకీయాత్రము? నేను భూపుత్రివలని కళత్రవాంఛ
బోనాడితి. నడికి నోడితి. కావున నీ వింక నావంకం గల
కూరిమి పేరిమి వెలయ నాలసింపక జాలిఁ బెంపక ప్రొద్దున
లేచి యెద్దియు విచారింపక సుమంత్రుండే రాయితంబు చేసి
తేర నియోగించి దాన మావదినె నారోహింపఁజేసి యశ్రాంత
పథికపరిశ్రాంత్యపనోదకం బై పావనోదకంబులం గ్రాలు
గంగాకూలంబున వల్మీకసంభవు నాశ్రమంబుకడ విడిచి రమ్మ.
నీకు మే లగుఁ బొమ్ము." అని యాజ్ఞాపించి ప్రజానిధి యగు
నాతనిని, పరదర్పఘ్ను లగుభరతశత్రుఘ్నులను, నిజనిల
యంబులకుఁ బోవం బనిచెను. అంత నయ్యన్నదమ్ములు
ము వ్వ రు నే మి యు మా ఱు ప లు క క
తలలు వాంచి కన్నులం గాఱుశోకవారిఁ గొనగోర మీటు
చుం దీటుకొనుకొందలంపాటుతోఁ జని తమమందిరంబులు
చేరిరి. రాఘవుండును నిదాఘసమయమహావాత సముత్థేపిత
జలజాతంబుభాతి రీతి చెడి వాడువాఱినమొగంబుతో శయన
నిలయంబుఁ జేరి కనులవెంట బాష్పవారి యవ్వారిగాఁ గాఱ,
కన్ను లెఱ్ఱవాఱ, మనంబునం దుందుడుకు మీఱ, నిదుర
తొలఁగి పాఱ, తూఁటుపు లెల్లవాఱునందాఁక వీఁక యెడల
యడలు చుండెను. అంత లోకమాత యగుసీతవలన దూఱు
గడించిన నీతిదూరులఁ గ్రాఁచ నేచినకోపంబునఁ గన్ను లెఱ్ఱ

చేసికొని విచ్చేసెనో యన నిజారుణకిరణప్రసరణంబు దెలసకుఁ గెంజాయ వెట్ట నినుఁ డుదయశిఖరిశిఖరంబు నలంకరించెను.

అంత లక్ష్మణుండు పె..ను..ఫు ము.. ము ప్రసకుఁ చేయుఁ జేసి తాలిమిమోయు నటి.. ..బు చేసి తెచ్చినరథంబు నంతిపురిమోసల నిలువఁ బంచి, "సుమిత్రినదా! రఘుపుంగవుండు, తెగఁ దారితసంబున నిజగా.. ..క్షేత్రం బను పేర గంగాతీర తపోధ నాశ్రమ బుపాంత నిడిచి రా నాకుఁ గట్టడ సేసె. చూచితివా నా కెట్టిబెట్టిద పుణ్యంబునకు నోఁగట్ట నయ్యెనో" అనుచు ధీరుండు గావున నాయంత యావంతయేని వెలిసేయక యేకలంకము నెఱుంగక యాత్మనిలయంబున నప్పటికిఁ గోలం దియగు మెలంకువలం బ్రొద్దుపుచ్చు చున్న వదినెసన్నిధానం బునకుఁజని కడునడఁకువదోఁప నాపావనికి మ్రొక్కి "తల్లీ! భూవల్ల భుండు, నీవుకాంక్షించినట్లు నిన్ను గంగాతటినీతటస్థమునిజనాశ్ర మంబులకుఁదోడుకొని పోవ నన్నుఁబంచె, పోవుదము రమ్మ" అనవుడు నప్పావ్వఁబోఁడి నవుమొగంబుతో "నరవరుండు నాకోరిక దీర్ప నీకు నానతిచ్చెనా? ఎద మెచ్చెనా? ఇదె వచ్చెద" అని సరభసంబున ఋషిపత్నుల కని కొన్ని హేమాంబరంబులు, రత్నాభరణంబులు, అపూపాది భక్ష్య పదార్థంబులు, గైకొని, అత్తగారి సెలవు వడయఁ గోరి వారు నివసించునగారంబు సొత్తెంచి, వారిసన్నిధిం బ్రాపించి, అత్తలు ముువ్వురకు నెఱఁగి, తమయత్తతో నామెమనసు చివుక్కురు మన "మీకొమరుండు సురనదీపరిసరారణ్య

పుణ్యాశ్రమంబుల నివసించు మునికన్యలం జూడఁగోరిన న న్నయ్యరణ్యభూములకుఁ దోడుకొని పోవ సౌమిత్రిం బుత్తెంచె, మీపంపు పడయఁ గోర యిట వచ్చితి. నాకీచన విచ్చి పుచ్చుఁడు.” నావుడు నాయమ “నాయనా యిది? అద నరయక మదనాగ మృగాదనమృగేంద్రకిరిలులాయశరభ ప్రభృతికూరసత్వంబులు చరింపఁ గంటకశిలావిశంకట సంకటం బయి కాలుకొనుఘోరకాంతారంబుఁ జూడఁ గోరు దురా? నిందుచూలాలవు నీవెక్కడ గంగాతీరం బెక్కడ? ఓపలేనిదాన వగునిన్నుఁ దాపసాశ్రమంబులకు బనుప నామనంబు గొలుపదు. ఈవాడఁబాఱినమోమును, ఈబడలిన యొడలును, ఐననీయునికిఁ జూడ జడదారిపడఁతులఁ గూడి యాడువేడుకఁ జెల్లించుకొన నిది తఱికాదని తోఁచెడిని. కా దనక నాబుద్ధి విని నిలువుము” అని యడ్డగాలు వేసినకౌసల్య పలుకులకు సీత మనంబు నోసి యందులకుఁ దగినయుత్తరం బిచ్చు వెరవు దలపోసి, “ఆనందవనవాసియు, దుష్కంటక హారణవిభాసియు, ఆశ్రితావనోల్లాసియు, దృప్యద్రిపుఖండన చండతరకరాసియు, భవద్గర్భవారాశిశశియు, అగు దినకరకుల శేఖరుండు నిరంతరంబు హృదంతరబునం గాఁపురంబు సేయ సకలశుభంబులకు నాస్పదంబు లగు మీపదంబు లారాధించు నట్టినా కెప్పట్టునఁనేపట్టుననున్న నేమి చెట్టు? మాటజవదాఁట నలుక దయ్యె నని యలుగఁబోక నాపోక కనుమతింపుఁడు” అని యా రామమాతపదజలజాతంబులు నిజలలాటంబు సోఁక సాగిలఁ

బడి లేవ కున్నం జేయునది లేక యెట్టకేలకు నట్టె యగుంగాక యనియె. అట్లత్తగారిచే నుత్తరువు పడసి చయ్యనఁ బయ్యెద నీవితోఁడఁ బెనఁచి నడికట్టు కట్టుకొని యిలు వెలువడి బయలికి వచ్చి యచ్చట నిలిపియున్న రథంబుపై మఱందియుం దాను నెక్కెను. అంత సారథి రథం బురవడిం బఱపం దొడంగెను. ఇట్లు పురంబు నిర్గమించి యరుగుచు ధరాకుమారిక పెక్కు లపశకునంబులు నయనగోచరంబు లగుటయు లక్ష్మణుం జూచి, అతం డీక్షణంబుల శోకబాష్పంబు లురుల ఱెప్పలల్లార్చుచు వదనతాపయుండై యుండ నిదియేమి యన్నా యన్న నో రెత్తక మిన్నకుండె. దానంజేసి జానకి మనంబు గలంగ "లక్ష్మణా! వెంగలినై కోరరాని కోర్కెఁ గోరితి. మాయత్త యిది తఱి గా దని యొత్తి చెప్పిన విన నేరనైతి. దానికి నిదర్శనంబుగా నివె దుశ్శకునంబు లనేకంబులు గాన నగుచున్న యవి. చూడుము. వఱపు తెరువాగెను. కుందే లెను రయ్యె. పాలపిట్టయు, గరుటాలమంతుండు నెడమనుండి కుడికిఁ బాఱెను. వాయసంబు కుడినుండి యెడమకుఁ బఱచె. పైఁడి కుంటె కీడుదోఁప వాపోవుచున్నయది. గాలి నుడిసి వీఁచెను. ధరణి గిరగిర దిరుగున ట్లగపడియెడి. బట్టపగలు గూబలు గుండ్రిలుగొలుపుచున్నయవి. కుడికన్నదరుచున్నది. ఇన రశ్మి హీనంగుపడియె. ఈ దుర్నిమిత్తంబులవలన నెయ్యెడి కొఱగాము లేవియుఁ నా జీవితేశ్వరునకుం గాక యుండుంగాక. ఏ పురుషోత్తముండు నన్నెడబాయ నేరక యనవరతం జరింప

బోవుచోఁ దోడుకొని పోయె, ఏలోకజనకుండు మునిజనావన
బుద్ధిం జనస్థానంబున నిరవుకొని యున్న ఖరదూషణాదిదోషా
చరుల నుఱుమాడె, ఏజితారి మాయలమారి మారీచు నిక్కం
బు మోసంబు గా దని యెఱింగి పరిమార్చె, ఏదండిమగండు
కోఁతులచేఁ గొండలు పఱపించి కడలికి నడవగట్టించె, ఏ పావ
నమూర్తి రావణుం జంపి దేవమునిగణంబులయార్తి యుడిపి
కీర్తి వహించె, ఆసదయాంతరంగుని కొలువు మాని యడవుల
మెలంగుముని పడంతులతోడఁ గూడి యాడ వేడుకపడినకట్టఁ
డికి నాకు నిట్టిది కాక మఱియెట్టిది శకునంబు లగు. 'వినాశకాలే
విపరీతబుద్ధిః' అనునట్లు చేటుగాలంబునకుఁ గాక నా కిట్టికోరిక
యూరక యేల పొడముఁ?" అని యిట్లు విచారించుచు నా
జగము తల్లి యుల్లంబునం దల్లడంబు పెరుగ నరిగెం గాని,
సారథీ! తేరు మరల్పు మనుమాట నోట గానీ నేర దయ్యె.
ఏవారికైనను దైవగతి నతిక్రమింపఁ దరమా? ఇత్తెఱం
గున నుత్తలపడు నత్తన్వంగిం దోడ్కొని లక్ష్మణుండు జన
పదంబులు, వననదీనదంబులు, గిరివరంబులు, కిరాతపుళిందఖేట
వాటంబులు, పెక్కులు కడచి చనిచని యినుం డపర
శిఖరి నలంకరించునంతకు నమృతోపమతోయ యగు
గోమతీనదిం బ్రాపించి, దానితీరంబునం జనదారుల నాశ్రమం
బుల నారేయి కడపి, మఱునాఁటిరేపకడ నందుండి కదలి,
మధ్యాహ్నంబునకు భాగీరథీతీరంబుఁ జేరెను. అప్పుడు సీత
శీతలవాతాహృతాతితాప పథికాంతరంగయు, రంగదుత్తుంగ

తరంగమాలికాడోలికాందోళిత రథాంగచక్రాంగ ప్రముఖ నిఖిలాంబుపతంగయు, అంబుజాతరంగస్ఫూర్తిసారంగయు, తీర సంగతనారంగ నాగరంగయు, పరిపూతాంగియు, అగుగంగ నంతరంగంబు పొంగం గనుంగొని, రథావతరణంబు చేసి, "భాగీరథీ! దాశరథియశంబుభాతి విశదాంబుపూరలం గ్రాలుని న్నాలోకింపఁ గంటి, నాకొఱంతలం దలఁగు మంటి, ధన్యాస్మి యంటి," అని యాపుణ్యతరఁగిణికి మ్రొక్కి పెక్కుతెఱం గులఁ గీర్తింపం దొడంగెను. అట్టియెడ లక్ష్మణుం డయ్యుపర లక్ష్మి నార్తిమెయి నవలోకించి, ఈలోకేశ్వరి యాజీవితేశ్వరు నానతియుఁ దనయాగతియు నిట్టి దని యెఱుఁగ నేరక తన కోరిక కొనసాగెనని పెల్లుల్లసిల్లుచున్నయది. ఇట్టిగోల కేలా గున బెట్టిదం బగుపట్టభద్రునికట్టడ యెఱింగింతు. అని తల పోయుచు వంచినతల యెత్తక తత్తఱిల్లుచుండెను.

పదపడి యమ్ముగుద యెన పొదలఁ బిఱిందికిఁ దిరిగి మఱందిం జూచి యేచినవంతం జింతిల్లునాతనితీరు తనమనంబు నకు దిగులు దగులుకొలుప, "నాచిన్నియన్న! మన విలు వెలువడినది మొదలు తేటదనంబున కాటపట్టగునీమొగంబు విన్నఁదనంబున కునికిపట్టయి కనుపట్టెడు. పరిసరవర్తులయార్తి నిరసించుపరమపావనిం గంగాభవానిం బ్రాపించియుఁ నించుకేని యుల్లసిల్లవు. తొల్లి రాజ్యభోగంబులకుం బాసి యడవుల గాసిల్లునప్పుడు నింత తాలిమిఁదూలి యుండం గన్నదానఁ గాను. జిత్తులమారి యగునింద్రజిత్తు నెదిరి పోరాడునెడనేని

యింత దుందుడుకు గొందవు. లోకకంటకుం డైనరావణుని
గంటలశక్తి యెడఁద నాటినయెడను నీవు కంట నీరు దేవు.
అట్లుండ నిప్పు డిట్లు కన్ను నీరు వఱద యై పాఱ నడల నేల?
పరసతీపరాఙ్ముఖుండవు, పరధనాపేక్షం బ్రిముఖుండవు, గురు
జనారాధనానురక్తుండవు, పరుషభాషావిరక్తుండవు, మాతృ
పూజాపరతంత్రుండవు, భ్రాతృహితాచరణమంత్రుండవు. ఇట్టి
నీవడల నాయెడఁద నుడుకు పొడమ కున్నె? తడయక యీ
గంగం దరించి తాపసాంగనలం గాంచి పలుకరించి కడువడిం
బుడమిఱేఁడునడుగులు గొలువఁ బోవుదము. వగ పుడుగుము.”
అని తన్నన్నియేని తెఱంగుల నూఱడించు చున్నపుడమికన్నెం
గన్నెత్తియైనఁ జూడక ఖిన్నత మానక విన్ననైనమొగంబుతో
నయ్యమయుం దాను నావికుండు తమచేరువకుఁ దెచ్చిన నావ
యెక్కి భాగీరథి నుత్తరించి తరి నవరోహించి యందుండి కదలి
నడచుచప్పుడు సింహవ్యాఘ్రమదేభశరభ కిరిలులాయప్రము
ఖానేక క్రూరమృగసంచారఘోరం బైనకాంతారంబుఁ బొడ
గని జనకరాజనందన కడుం దలరి ముందరియుత్సాహంబు
దఱిఁగి మఱంది నవలోకించి “ఇలు విడిచి బయలు దేఱినది
మొదలు దుశ్శకునంబులె కాని సుశకునం బొకటి యైనఁ గాన
రాదయ్యె. చింత యన నెట్టిదో యెఱుంగనినీవు చింతాక్రాం
తుఁడవై యెంతయు సంతాపించు చున్నవాఁడవు. ఇది యంత
యుఁ గన్నులారఁ జూచియుఁ బురంబునకు మరలక ‘స్త్రీబుద్ధిః
ప్రళయంకరీ.’ అనుమాట చరితార్థంబుగా నిట వచ్చితి.

నేఁజూడఁ గోరినది మునివల్లభు లాజ్యాహుతుల రటులఁజేయ నగ్నికుండంబులనెగయు హోమహోమధూమంబులచేతను నేమంబున సామప్రవర్తనులై విద్యాభ్యాసపరత్వంబున గురుకులవాసంబు చేయు వటువుల వేదాధ్యయనఘోషంబులచేతను, భర్తృశుశ్రూషాపరాయణ లగు యోషిజ్జనంబులకు సుఖసంచారయోగ్యంబు లగు మార్గంబులచేతను, ఒప్పారుపుణ్యారణ్యంబులం గలతాపసాశ్రమంబులు గాని, పెనుగాలి నలిరేఁగి కాఱుపొదలం బొదలుకొని చీకుమ్రాఁకులం బ్రాఁకి మిన్నంటి యేర్చుకార్చిచ్చుపొగల తెగలచేతను, తెగుదారులకేనియు దిగులుపొడలించు మదశుండాలకోలశార్దూలాది క్రూరసత్వకఠోరకంఠనాదంబులచేతను, పాదంబులు సోనుప ననువుపడక ముండ్లకంపతొడఁగులనింపునఁ బెంపారుగడుసుదారులచేతను మనంబునకు వెఱపుగొలుపునరణ్యనికాదు. దుర్బుద్ధినై యిట్టికాఱడవిఁజిక్కువడి క్రుక్కుఁబాలుపడితి. మన్నెన్నఁడునిట్టిబెట్టిదంపుటడవులం గనియెఱుంగ. గుట్టెఱుంగక పట్టభద్రుం బెడఁబాసి పట్టడవులం బ్రాపింపఁగోరనా యట్టిదానికి నిట్టివి గాక వేలిపట్లు లెట్లు గనుపట్టు." అని వలువగల వగచుచుఁ దనుం గనుంగొనుచున్న గుద నట్టె చూచి సుమిత్రపట్టి లోనితాపంబు నాఁపలేక వెలిపుచ్చెడినో యన నిట్టూర్పు సెకలు వెదచల్లుచు, "తల్లీ! చనదనక పూనరాని పనిఁబూని వచ్చిన నన్నుం బుచ్చి చావం దిట్టుము. ఇట్టి పాపకృత్యంబున కొడిగట్టిన బెట్టిదు వట్టు పెట్టుకున్న లోకంబునకుఁ బెట్టయగు." అనుచు మకరందాసక్తి నర

విందంబుపై వాలినరోలమంబులీల నాలీలావతియడుఁగుదమ్ము
లం బడి యొడలు మఱచి మరల లేవనేరం డయ్యె. దానంజేసి
యాసీమంతిని యెదవడి పెదవులు తడుపుకొనుచు, తుద
మొదలు గానరాని కొందలంబున డగ్గుత్తికవడి క్రిందుచూచుచు
నెట్టకేలకు నెలుఁగు తెచ్చుకొని, "అన్నా లక్ష్మణా! నీ విప్పు
డేమిపని పూని వచ్చితివి? ఎవరి కెగ్గుదలఁచితివి? మీ యన్న
కుం జెప్పక న న్నిప్పట్టునకుఁ దోడితేవు గదా! చిన్ననాటినుండి
మీయన్న నేమఱక కొలిచి యాయనమన్నన వడయుచుండు
నీకు నీయెడల నిట్లడలనేమి యిడుమ తోడరెను? గురులనిందించి
తివో, శరణాగతులనరయువైతివో, కన్నతల్లిం గారవింపవైతివో
మఱియేమేనియకార్యంబుచేసి తాలిమివాసి గాసిల్లెదవో, తెలియఁ
బలుకుము. మనమార్గవర్తి యగుకౌసల్యపట్టి దయ తొలఁగఁ
బెట్టి నిన్నేనియు నన్నేనియు విడనాడెనో, దుడుకులాడెనో,
వినిపింపుము. ఆసుద్ది నే వినరానిదేనియు ననుమానింపఁబని
లేదు." అని మదికిఁ దోఁచిన ట్లెల్ల నడుగుచు నడుగులంబడి
యుడలు చున్న తన్నెగయ నెత్తి చెక్కులొత్తి మక్కువమీఱ
నూఱడించు నయ్యపరలక్ష్మికి లక్ష్మణుం డిట్లనియె

"జననీ! చన దనక యింతపనికిఁ దెగించి వచ్చినతెగు
వకానికి నాకుఁ బూనినపని తెలుపక పోవ నెట్లు వచ్చు? ఒచ్చెం
బు లేక యిచ్చు పొదలఁ బారమార్థికపద్ధతి నోరార వివరిం
చెద. అవధరింపుము. మనపురజనులలోఁ గృతాకృతవిచార
దూరు లగుకొందరు దురాత్ములు 'రక్కసిదొర మక్కువపడి

కొనిపోయి తనవీట నేఁడుగాలం బుంచుకొని యున్నయించుఁ
బోఁడి వాఁడిమిమెయిం గొనివచ్చి మన్నుత్తేఁ డిచ్చు మరు
లెచ్చు నేలుకొను చున్నవాఁడు. కంటకుం దెలుంగని యర
విందమిత్రగోత్రంబు నిందాపాత్రంబయ్యె.' అని యాడుకొన
నాయాడికకు నోడి నీబోఁటిసీమాటి నీమిన్నేటిచెంగటి వనవాటి
నాటుకొలిపి రమ్మని కనికర మ్మెఱుంగని కఱకరి నోరుం
గానక నన్నుఁ బనిచె. నే నందులకుఁ బాలుపడి వచ్చితి. పతి
నెడఁబాపఁ బాల్పడినపతితుఁడా వితావెతలఁ బొరలక పురంబు
సొరఁ బొమ్మనుము." అనునాచుఱుకుఁబలుకులు వాఁడిములు
కుల వడువునఁ జెవులు సోఁకుటయు నాయిల్లాలు పెనుగాలి
సోఁకునం బ్రాఁ కెడలి వ్రాలు పూఁదీఁగెయుంబోలె నేలకు
వ్రాలి మూర్ఛిల్లెను. అంత సుమిత్రాపుత్రుండు చిత్రంపుఁ
బతిమసాంపునఁ గొంతవడి యేమియుం దోఁపక రాపడి నిలువఁ
బడి పదంపడి హెచ్చరికపడి పెక్కులు శైత్యోపచారంబులు
చేసియు సీతం దేర్ప నేర్పు చాలక నేను రఘువరసేవానిరతుం
డనేని భూసుత యపగతప్రాణ గాక లేచుం గాక యని పలి
కెను. తోడనె సీత కళదెలిసి లేచి గడగడ వడఁకుచు మఱఁది
నవలోకించి, "సౌమిత్రీ! ధాత్రీకళత్రుండును నీవును దొల్లి
పదునాలుగేండ్లు కాఱడవులం గాఱియఁబడ కుండఁ గాపాడి
కొనివచ్చి యిపు డీయడవిపట్టున నొంటిగ దిగవిడువ నెట్టు
దలపెట్టితిరి.!" అని వనట యప్పటప్పటి కతిశయింపఁ గనుల
వెంట వెడలుబాష్పాంబుధారలు చెక్కిళ్ళ దిగజాఱి యురో

దేశంబున నిర్ఝరాకృతిం బాఱి, వేఁడినిట్టూర్పు సెకలఁ జిగురుఁ
బెదవి కమలి కొమరువాయు, తుఱిమినవిరులతోడనె తుఱుము
వీడి నెఱికురులు చిక్కువడి మూఁపునం బొరలాడి, ఓరుగాలి
నల్లలాడుబంగారుతీఁగెతీరునఁ దీరు దప్పి బడలికతోడినెమ్మేను
మూలియాడ, మంచు గప్పినతామరసంచునఁ జిఱుచెమ్మటలు
గ్రమ్మిన చిన్నినెమ్మొగంబుతోఁ దాలిమి దూలి, "హా!
దైవమా? దయమాలి చూలా లనక న న్నీ కాఱుకోనపాలు
చేసితివా?" అనుచు "లక్ష్మణా కోరరానికోర్కులు కోరునారుల
కిదియె మేర కాఁబోలు, కాదేని హరునిశరాసనంబు విఱిచి పరి
ణయంబై గురునానతి నరణ్యంబుల కరుగుచోఁ బురంబున నురివి
పోవుటుఱవు కాదని వెనువెంటఁ దోడుకొని పోయి యందు నేఁ
గోరిన మాయామృగంబుఁ బట్టఁ బోయి యది చిక్కమి
నొక్కమ్మునం జానేసి ననుం బాసి వనవాటికలఁ బలు
పాటులు పడి వానరసేనలం గూర్చికొని కడలి గట్టి దాఁటి
లంకానిశాటకోటిం గడముట్టించి జగద్రోహి యగుదశకంధ
రుని సంహరించి శుచిప్రవేశంబున శుచితఁ దెలిపిన నన్నుఁ
గైకొన్న శ్రీరామచంద్రుం డది యంతయు మఱచి ప్రేమ
యెడలి యడవి నిడిరమ్మని నిన్నుఁ బుత్తెంచునా? ఒకవేళ
మీయన్న నాకోరిక దీర గంగాతీరవనాంతరంబులకుం దోకొని
పోయి రమ్మన్నఁ బరాకునఁదప్ప విని యిట్టు లాడెదవా?
అదెక్కడి మాట, నీయట్టిజాగరూకునకును మతి దప్పునా?
రాఘవునియానతి యట్టిదయగు, ఆమహామహుండు ఇది

మునుపు తన్నెడఁబాసి లంకలో నశోకవనికామధ్యంబున రాకాసులమూఁకలం గలసి పెక్కునాళ్లు వసింపలేదా, ఇప్పుడు నట్లు వనంబున నుండఁ జాలును' అని యనుమానింపక నన్నిట డించి రమ్మని యానతిచ్చె నేమో, అప్పుడు పుడమీశుండు రాఁగలండు, వచ్చి రాకాసి మూఁకతోడ రావణుం జావఁ గొట్టి నన్నుఁ జేపట్టఁ గలండు, అనునాసంజేసి యసువులకుఁ బాయనైతి. కాకున్న నన్నా కరుణానిధి మరలఁ గాంచఁ గలుగునా? ఇది విచారింపక సువిచారదూరు లగుపౌరులు మోపిన నిరాపనిందలకుం గరంబు కనికరంబు దొలంగి యరణ్యవాసినిం గావించెఁ గాని, ఇది యిట్టు లని యొక మాట నాకుఁ దెలిపి కలఁక మాన్పి యనుఁపడయ్యెఁగా! ఇఁక నాయహల్యా శాపాపహనీకాయంబుతో నేయంబు దొలనుకాడఁ జూడ నోనఁగూడెనే, నే నెంత నిర్భాగ్యరాలను, రత్నగర్భాగర్భసంజాతనయ్యు, రఘువంశాంబుధిచంద్ర శ్రీరామచంద్రకరగృహీతనయ్యు, పూతచరితనయ్యు, దిక్కుమాలి కాఱుఁగోనలఁ జాలిఁబడఁ బాలైతి. ఎందుఁ బుట్టిన నెట్టివానిఁ జెట్టపట్టిన నేయిల్లు మెట్టిన దుఃఖభాగినులకు దుఃఖంబె కాక సుఖంబెట్లు ప్రాపింప నగును? కాంతారవసతు లగునసతులకు నంతఃపురవసతులు వసతులగు నెట్లు?" అనియిట్లు బహుప్రకారంబులఁ బలవించి పలవించి తపించుచున్నవదినెకు బదులు సెప్ప మాట లేక లక్ష్మ

ణుండు బయలం జిత్రించిన చిత్రంపుబొమ్మ చెలువున నిలువం బడి యుండెను. అంతం గొంతవడికిం దాలిమిపూని జానకి యామానధనుని కిట్లనియె.

"అన్నా లక్ష్మణా! నన్నుం గటాక్షింపుము. ఆడుదానం గాన మీాతీనకొండలంబునం దలం జెఱంగక నోరికొలందు లాడితి. ఇది పాడి గాదని యలుక వహింపం బోకుము. ఏడంబాటున కోటువడి యేలినవారి నపదూఱుపాలు వఱచుట నాకును దగవు గాదు. అది సహించుట యామహానీయునకును గడుభరంబు. కావున పరమకృపాపరుండగు నాపరమపురుషునకు మ్రొక్కితి ననుము. తనయానతిం దలమోచి మెలంగెద ననుము. నా కేడుగడయుం దానె యనుము. నావలని నెయ్యంబు నెన్నండును మఱవవల దనుము. నన్నుంబోలె విడనాడక చుట్టములను బ్రకృతి జనులను బ్రోవం గోరెద ననుము. మా యత్తలకుం దక్కిన క్రొత్తడులకు నతులొనర్చితి ననుము. తమ్మొడంబాసి యును ఉన్నవఱకు నీ కాఱడవులం బడియుండం బాలైతి ననుము. మీాయన్నకు శుభంబు లొందనిమ్మా. మేలు గైకొమ్మా. పోయిరమ్మా." అని యొప్పగింతలు పెట్టి పొమ్మనుచు నాంపరానిసంతాపమ్మునం గన్నీరు మున్నీరై పాఱనెలుంగెత్తి యేడువం దొడంగెను. అట్టియెడ లక్ష్మణుం డద్దేవిదీనభావంబు గనంగొని పేరెలుంగున, "ఓవనతరులారా! కల్లరినై మాతల్లి నిట దిగ విడిచి నడన గమకించుచున్నాండ. మించినమైత్రిం గనిక

రించి ప్రోవరే" అనుచు ధేనువుం బాసి చన నేరనివత్సంబునుం బోలె నుత్సాహంబు దక్కి యల్లన నాయమకు మ్రొక్కి వల గొని యవలఁ జనఁ గాళ్లురాక కనుఁగొలుకుల వెడలుబాష్ప వారి గోట మీటుచుం జని, ఓడయెక్కి యేఱు దాఁటి తిరిగి తిరిగి చూచుచు, అడుగులు తడఁబడ నడుగడుగునకు మ్రొక్కు లిడుచు, ఆపురని యఱచి తల్లీ నీకెల్లవియుఁ గలిగియు దిక్కు లేనిదానిపోలిక నడవిఁ జిక్కి జాలిఁ బడనయ్యెఁగా! అని పలు కుచు, తే రెక్కి తీఱనివగలం దగిలి మది పొక్కి సారథిదిక్కు మొగంబై, "సుమంత్రా! చూచితివా, నడుమంత్రపు నీచుల దుర్మంత్రంబు లెంతచేసెనో, శ్రీరామయుంబోని యీ రామ దేవునిల్లాలు భిల్లవనితావిహారయోగ్యం బగు కాంతారంబున నిడుమలుగుడువఁ బాలయ్యెను." అను నాతని దీనాలాపం బులు విని, సుమంత్రుం డిట్లనియె. "సౌమిత్రీ! యెల్ల వారికి ఖేదమోదంబులు కా లా ను గు ణ్య ం బు లై యా పాదిల్లుట నైజంబు. దైవతంత్రంబు మీఱ నెవ్వారు నేరరు. ఇది యెఱింగియు నీకెంతయుఁ జింతిల్ల నేల! తొల్లి యొకానొకసమయంబున మీయయ్య వసిష్ఠునాశ్రమంబు నకుఁ బోయి యాకులగురుని గొలిచి యుండునప్పు డచ్చటి కేకవార్షికమఖంబు సలుప దుర్వాసుండు విచ్చేసె. ఆతనిరాక గని జనవరుండు వినయవినమితమస్తకుం డగుచు దదాశీర్వచ నంబులు వడసి యుచితాసనాసీనుం గావించి తదనుమతిం దా నాసీనుండయి వినోదగోష్ఠి నెఱపుచో 'మహాత్మా మన

రామచంద్రుం డెన్నాళ్లు ప్రజాపాలనంబు సేయును? అతని కెందఱు కొడుకులు కలుగుదురు? ఆతనిజీవితకాలం బెన్ని యేండ్లు? ఆనతిమ్మ' నావుడు, నామునివరుండు గ్రాముండు పదునొకండువేలేం డ్లిల యేలఁగలఁడు. పెక్కులు క్రతువులు సలుపఁ గలఁడు. ఆయన కిరువురుకొడుకులు కలుగుదురు. అందగ్రతనయుం డయోధ్యకు నధిపతియగు. భరతాదులకు నట్లె యొక్కరొకరి కిరువు రిరువురు సుతు లుదయింతురు. వా రన్యభూములకు నేలిక లగుదురు. మఱియు రామచంద్రుండు రాజ్యభారంబు వహించినపిదపఁ బెక్కేండ్లు ప్రియురాలిం బెడఁబాసి విరహాగ్నిం దపింపఁ గలఁడు. అందులకుఁ గారణం బొండు గలదు. తొల్లి దానవులు కొందఱు దానవారివాడి నోడి పలాయితులై భృగుపత్నిమఱువు సొచ్చిన నాయబల తా నబల యయ్యు వెఱవకుం డని వారల కభయం బిచ్చి రాక్షసాంతకుం డగు పుండరీకాక్షు నిరోధించిన, అతండు కలుషించి స్త్రీవధంబు పాతకంబె యైనను దుష్టశిక్షణంబు సర్వపాపాపహం బని తలపోసి యామెతలఁ దెగఁగోసి తదీయాదృతపిశితాశుల గతాసులం జేసి తనబిరుదు నిలుపుకొనియెను. దానంజేసి భృగుండు కుపితుం డై లోకు లెల్ల దేవుం డని కొలువఁ గొలువుండనీ వది మాని సామాన్యుండునుంబోలెఁ గ్రూరభావంబున నాఁడుదానిం జంపినఁ బెంపు తఱుఁగు ననక సువిచారదూరుండ వై నాదారం దునుమాడితివి కావున మర్త్యంబున

మానవుండవై జన్మించి భార్యావిరహంబునఁ బరితపింతువు గాకయనియె. అదికారణంబుగా సర్వదేవమయుం డగువిష్ణుండు మానవుండై రామచంద్రుం డన నీయందుఁ బుత్రాకృతిం జనియించి, సాక్షాల్లక్ష్మి యగుసీతం బెండ్లియాడి, తదీయవిరహంబునఁ బెక్కేండ్లు సంతాపింపఁ గలండు.’ అని యానతిచ్చె. హరిహరాదులకేనియుఁ గృతం బనుభవింపక తీఱదు. ఈరహస్యం బప్పుడు రథచోదకుండ నైనవాఁడు మాతండ్రిచేఁ దెలుపఁబడియె. ఇప్పు డది దైన్యానీనమానసుండవగుటంజేసి నీకు నేఁ దెలిపితి. దీని నిఁక నేరికిఁ దెలుపక జానకిని గానపాలుచేసి వచ్చితి ననుకొని అంత యంతరంగంబునం జొనుపక వంతఁ దొలంగఁ ద్రోచి నెమ్మది నుండుము.” అని యూఱడిలం బలికెను.

ఇట సీతామహాదేవియు ధవునిపదంబు లెదం దలంచుచు, అనుంగుమఱఁది మరల దన్నుఁ గొన వచ్చునో యను నడియాస నతండు పోయినవలనికి మాటిమాటికిఁ జూపులు నిగుడ్చుచు, అమ్మా! నా మొఱ యాలకించి యూఱడింప రావేల యని నేలం గాంచి మందలించుచు, భాగిరథీ! దాశరథి నెడఁబాసినదోసంబు లోఁగొని నన్నుఁ గైకొని కావ రావమ్మ యనుచు, కొంతతడవు వగచి, దిగు లెదఁ గదుర నెదురం గనుపట్టు పెన్గట్టులం గుట్టలం జెట్టులం గాంచి పెనువంతం గాంతారంబునం గలఖగమృగంబులు కలగుండు నడి వెఱచి పఱవఁ బటురవంబు చెలంగ నెలుం గెత్తి యేడువం దొడంగెను.

అయ్యేడ్పులెలుం గప్పరిసరారణ్యంబులఁ గుశసమి త్ఫలాహరణార్థంబు చరించు చున్నమునికుమారులు విని య చ్చోటికి వచ్చి యచ్చింతావతిం జూచి నొచ్చుకొని చయ్యనఁ దమగురు వగువాల్మీకిం జేరి "ఆర్యా! ఇయ్యాశ్రమంబుచేరువ కాంతారంబున నొక్కకాంత దురంతచింతాక్రాంతయై వాపో వుచున్నది. ఆమెచెలువు గన్నఁ గమలనిలయంబు వాసి యిలకు వచ్చినకమలాలయ యొకో యనం దగియున్నయది. ఆకాంతా మణి నరయ నవధరింపుదురు గాక." అనవుడు నమ్మునీశ్వరుం డంతవృత్తాంతంబుఁ దనదివ్యచిత్తంబున నారసి, ఆయుత్త కాశిని వైదేహి, రామభూమినాథుని దేవి, మీఁద లక్ష్యంబుగొని వేగ చనుదెం డని యానతిచ్చి, కడు సంభ్రమంబున గంగా తీరంబుఁ జేరఁజని, అచ్చట బిట్టువాపోవు చున్నపుడమిపట్టిం గన్నులారఁ గాంచి, తనరాకగని యేడ్పు చాలించి కన్నీరు దుడుచుకొని తెప్ప లల్లార్చుచు నతి యొనర్చిన యచ్చి న్నారి నూరార్చి, "కూఁతురా నీవు పూతచరిత్ర వగు టెఱింగియు రఘుపుంగవుండు నోటికొలంది లాడుకొనెడు పామరుల యాడికలకు నోడి నిన్ను విడనాడె. నీవోడకుము. నే నిది యెఱింగి నాయింటికిఁ దోడుకొని పో వచ్చితిని. నన్ను నీజనకుం దగుజనకునింగ భావించి నావెంట విచ్చేయుము. నీయట్టివివేకవతులు తాలిమి నూని జాలిం దూలంబాలుపడరు. కావునఁ దాలిమి వహించి యరమరఁ దొలంచి మునికన్య లొనరించు నుచితోపచారంబులం దనుపు గాంచి నాయాశ్ర

మంబున వసించి దుఃఖంబు నపనయింపుము. ఇదె యర్ఘ్యంబు గైకొమ్మ" అని యుచితరీతి నుపచరించి మించినకూరిమిం దనయాశ్రమంబునకుఁ దోడుకొని పోయి యందలిమునికన్యల కప్పుణ్యవతిం జూపి, "ఈరాజానన రాజీవబంధువంశాభిరాముఁ డగురాముని దేవి. సకలప్రకృతిజనకుం డగు జనకునికూఁతురు. స్వవశీకృత ప్రతిరథుం డగుదశరథుని పెద్దకోడలు. లోకమాత. పేరు సీత. ఈతలోదరి నాదరించి మీర లందఱు భక్తి నెఱపం దగు. కొందఱు మందులు ముందువెనుక విచారింపక యుచితాచరణంబునకు విముఖు లగుదురు. మీర లాదారిఁ గొనియాడఁ బోయెదరు సుమీ." అని యానతిచ్చిన మహాప్రసాదం బని వార లయ్యమ నుచితోపచారంబులఁ బూజించి యాదరించిరి. సీతయు నుల్లంబున నుల్లసిల్లెను. మునివరుండు సంతసిల్లెను.

ఇవ్విధంబున వైదేహి వల్మీకసంభవునాశ్రమంబున నివసించి యమ్మునివరుం డనుదినంబు నాదరంబునం జెప్పెడియితిహాసంబుల వినికివలనను, అచ్చటిమునికన్నియలు కూరిమి మీఱ నొనర్చునుపచారంబులవలనను, మనఃక్లేశంబుఁ బాసి పొద్దులు గడపు చుండి యంతలో నీళ్ళాడఁ బ్రొద్దు లగుటయు నొక్కశుభదినంబునఁ జక్కర వింటివాని నెక్కసక్కెంబు లాడుచక్కందనంబున నానందం బొసంగునందన యుగళంబుఁ గనియెను. అట్టియెడ వారలశుభోదయంబునకు దశదిశలుఁ

దెలివి నొందెను. బృందారకులు దుందుభిధ్వానంబులు చెలంగ మందారకుసుమంబులు గురియించిరి. ఎల్లవారలయుల్లంబులు చల్లగాఁ జల్లగాలి వీచెను. హోమకుండంబులఁ బ్రదక్షిణార్చుల నర్చిష్మంతుండు గనుపట్టెను. అంత నచ్చటిమునికళత్రంబు లెల్ల వచ్చి భూపుత్రిం బుత్రవతి వైతివి నీకొంతయు లెల్లఁ దీఱె నని యఁగ్గించుచుఁ దత్సమయసముచితోప చారంబులు నడపి వడుగులవలనం దద్వృత్తాంతంబు వాల్మీకిమునకుఁ జెప్పి పుత్తెంచిరి. అతండు నట్టిశుభముహూర్తంబున భూపుత్రి పుత్రద్వయిం గనియె నన విని, పూర్ణచంద్రోదయంబునం బొంగు రత్నాకరంబునుంబోలెఁ గరం బుప్పొంగి యాకుమారులకు జాతకర్మంబు నడపి కుశుఁడు, లవుఁడు అని నామకరణంబును జేసెను. పదపడి యయ్యామడలు తల్లియొడఁద చల్లవడ దినదిన ప్రవర్ధమానులై తత్తత్కాలోచితక్రీడలం దేలుచుఁ దదాశ్రమ వసతు లగుసతులకు నానందంబు సంపాదించు చుండం బండ్రెం డేండ్లు కడచనియెను. అంతట నాకుజాం డాకుమార వరులకు నుపనయనంబు చేసి వసిష్ఠునిహోమగవి రావించి దానివలన నఖిలవస్తువులను బడసి ఘృతపాయసాపూప సూపసమృద్ధం బుగాఁ జతుర్విధాహారంబులు గల్పించి యచ్చటి మునిశ్రేష్ఠుల కెల్లఁ దుష్టిగా విందులు నేసి యమ్మహోత్సవంబుఁ జూడ వేడుక పడి దవ్వులనుండి వచ్చిన జడదారులకుఁ గొలందు లరసి కట్నం బులుఁ గానికలు నిచ్చి పుచ్చెను. అట్లుపనీతు లైనయాసీతా సుతులు ప్రాచేతసుతో సకలశాస్త్రపురాణేతిహాసంబులును,

వేదంబును, ధనుర్వేదంబును, అభ్యసించి, దివ్యాస్త్రప్రయో
గోపసంహారంబులతోడ నస్త్రవిద్య వడసి, సకలకలా కుశలు
లయి, వాల్మీకిరచిత శ్రీరామాయణంబుఁ బారాయణంబు
సేయుచో సంగీతపక్కిని స్వరలయతాళగతులు తప్పక వీణగొని
కుశుండును, తాళంబుగొని లవుండును, గానంబు సేయం దొడం
గిరి. అది యంతయుం గన్నులారఁ గాంచియు, చెవులార
నాలకించియు, ఆ కొమరులు ముని కుమారులబడి నడవులకుఁ
జని కొనివచ్చి యిచ్చుఫలమూలంబుల నారగించియు, వారల
యుపలాలనంబులఁ బ్రొద్దు దోలంచియు, మించిన సంతసం
బంతరంగంబునం దొంతరలాడ జానకి మనోగ్లాని మాని
నెమ్మది పూని మెలంగు చుండెను.

అట రఘుకులవల్లభుండు నిజవల్లభం బెడబాసిన
తుందుడుకు మనము నుడికింప దుడు కొందక ప్రకృతిజనంబుల
మనంబుల కెక్కఁ బుడమి పాలించుచుండి, కొండొకకాలంబు
నకుఁ బౌలస్త్యసంహారణజనితనికృష్టం బగుబ్రహ్మహత్య
నిర్దుష్టంబుగాఁ దొలంపఁ దలంపుగొని, దూరీకృతదురితసుమేధం
బగునశ్వమేధంబు సేయువాఁడయి, వరిష్ఠు లగువసిష్ఠవామదేవ
గాలవగార్గేయాదిమునివరులు సన్నిధి నేసినయవసరంబునఁ
దనతురంగమేధాచరణకాంక్ష యెఱింగించి, అయ్యాగంబు
నిఖిలపాపక్షయకరం బని నిగమంబులు నిగదించుంగాదె యన
వుడు నందఱయనుమతంబున వసిష్ఠుండు రఘుకుల వరిష్ఠున
కిట్లనియె.

"భూనాథా! అశ్వమేధంబు మిగులదుస్సాధంబు. అయి నను తద్విధానంబు వివరింతు సావధానమతిం జిత్తగింపుము. ఆవుపాలునుంబోలెఁ దెల్లనై తేటమీఱినమేనును, పద్మరాగంబు నుంబోని జానగువరుణశిరోధియు, బంగరుచేరులవింజామరంబు నుంబోలెఁ బసిమిమిగులుదీర్ఘవాలంబును, ఇంద్రనీలంబుచందం బున శ్యామలంబులై యలగారు వీనులును, గలవారువంబు గొనితెచ్చి యర్చించి, నిజబిరుదపట్టంబు దానినొసటఁ గట్టించి, భూవలయంబునం దిరుగ విడువవలయు. దానిఁ గావ నతిశౌర్య ధుర్యు లగునా ప్తజను లరుగవలయు. ఉత్తమకులజు లగు ద్విజులు వేవురు ఋత్విజులు వరణీయులు గావలయు. వారి కొక్కొక్కరికి నొక్కొక్కగజంబును, ఒక్కొక్కరథంబును, వేయేసి హయంబులను, వేయేసి పాఁడి మొదవులను, వేయి బారువుల బంగారును, నల్తుము ముత్తెములను, నలువురు భటులను, గానుకగా నీవలయు. యజమానుండు సభార్యుండై నియమంబు పూనవలయు. అపత్నీకుం డుపక్రమింపరాదు. మఱియు ధరఁ దిరుగ విడిచిన తురంగంబు పరులచేఁ బట్టు వడియెనేని క్రతుభంగంబగు." అని యానతిచ్చెను. అది విని రామచంద్రుండు "మునివరా! జాతరూపంబున మహీజాత రూపంబు గల్పించుకొని యపత్నీకతపేరికొఱఁత నపనయించి క్రతు వుపక్రమించెద. సవనహయంబుఁ గాన నాయనుజులం దొక్కరు నియమించెద. తక్కు వానిం దక్కక నొనఁగూర్చెద. ఇంక నేమేని దెలుపవలసినఁ దెలుపుఁడు." అని తెలియవలయు

వానినెల్లఁ దెలిసికొని యప్పుడ లాయంబున నున్నయాగ యోగ్యహయంబుఁ దెప్పించి చూపిన నత్తాపసోత్తముండు విస్మితచిత్తుండై యొక్కసుముహూర్తంబున యాగశాల నిర్మింపంజేసి విధ్యుక్తంబుగా వేవురు ఋత్విజులను వరించి విహిత దక్షిణ లిప్పింప రాఘవుండును గనకసీతాసమేతుండై యజ్ఞదీక్ష వహియించి, విరాజమానచామర రత్నకింకిణీదామసుగంధ మాల్య పరిధానమృగమదాదులచే మఖవాజిఁ బూజించి,

"క. మిత్రకులాగ్రణి దివిజ
స్తోత్రపరాక్రముఁడు వీరసూః కౌసల్యా
పుత్రుఁడు రఘుపతి విడిచిన
సత్రహయముఁ బట్టుఁ డుర్వి సాహసు లున్నన్."

అనునిజబిరుదపద్యంబు నొకబంగరుపట్టంబున లిఖించి, దాని నాఘోటకంబు నొసటఁ గట్టించి, చతుర్విధవాద్యంబులు సెలంగ హయంబు వలగొని మ్రొక్కి పోవిడిచి, దానిఁగావ నతిదృప్తశత్రుఘ్నుం డగుశత్రుఘ్ను నియోగించెను. అతండు నన్నకు మ్రొక్కి యుక్కునం జొక్కి కనవీరయోధులతోడి మూడక్షోహిణులబలంబుబలసికొలువదిక్పతులతోడనయ్యమా రమావాణీరమణులు వచ్చి యడ్డగించిరేనియు మాఱొడ్డ గెలుపుకొనియెదఁ గాక యనుచు నశ్వంబుబడిఁ దడయక నడచెను.

అట్లు విడువంబడినసవనహయం బెల్లవిషయంబులు చొచ్చి వాయువేగంబున నడ్డులేక చరించునప్పు డయ్యోదేశఁ

బులభూమీశులు దానిఁ బట్టి నొసటఁ గట్టి యున్నట్టి కనక పట్టికం జదివికొని కౌసల్యపట్టి విడిచినతత్తడిం బట్ట మన మెంత వార మని వినయవినమితోత్తమాంగులై మెత్తపాటుతో వివిధోపహారంబులు గొని శత్రుఘ్ను నెదుర్కొని యివిగొని జానకీజానిసన్నిధి నిడి మన్నింప వేఁడుకొంటి మనవలయు నను చుఁ దొలంగి చనుచుండ నయ్యశ్వోత్తమంబు విశ్వంబు సర్వం బుఁ గలయం దిమ్మరి తుదకు సకలసుఖమ్ములకు నాలవాల మ్మగుగంగాకూలమ్ముఁ జేరి పరమమునినాథవధూనివహావ రోధంబైన వాల్మీకిభవ్యాశ్రమోపాంత కాంతారంబున నమనమలాడుపచ్చికపట్టుల నిలిచి యిచ్చపోదల మేయందొడం గెను. అయ్యవసరంబునఁ బ్రచేతునిచేముఖార్థంబాహమాయమూ నుండై ప్రాచేతసుండుతత్పట్టణంబునకుఁజనఁగుశలవులాశ్రమంబు నరయువారై కోదండంబులు సజ్యంబులు గావించుకొని చెఱి యొకదెసఁ జరించు చుండిరి. దానంజేసి యచ్చటితాపసపటు వులు కొందఱు తత్ప్రాంతంబునఁ బచ్చికమేయుచున్న హయంబుఁ జూచి దాని రాక లవునకుం జెప్పిరి. అంత నాకు మారుం డది యున్నవలనికి వచ్చి చూచి పట్టుకొని తదీయ ఫాలపట్టికం గట్టియున్న హేమపట్టంబునఁ గనుపట్టుబిరుద పద్యంబుఁ జదువుకొని వీరావేశం బట్టె పెరుగ, ఔరా యహం కారంబు వీరసు వగుకౌసల్యపట్టి విడిచినసత్రహయమఁట, శూరులెవ్వారేని యున్న నీవారువంబుఁ బట్ట నగునఁట. దీని నెట్లు విడువ వచ్చు. సచ్చరిత్ర యగుసీతామహాదేవి పుత్ర

ద్వయం గనియు వీరసువు కాదయ్యోనేని రాము నొక్కనిఁ గన్న కౌసల్య యెట్లు లగు ? అని బెట్టిదంబుగాఁ బలికి, అందుల కులికి వలదు వలదు బలవంతులతోడి వైరం బని తన్ను వారించునిరాబారివడుగుల నొడఁబఱుచువాఁడై, "వటువు లారా ! మీకేల యీపిటికితనంబు, పరమకారుణికుం డగు వాల్మీకిమునివరుం డనుగ్రహించి యిచ్చినధనుర్విద్యప్రాపున మనవారి కెల్ల గౌరవంబును సిరిని గడించెద. ఇంచుక నిలిచి చూచు చుండుఁడు." అని నవ్వుచు తనమూఁపున వ్రేలునుత్త రీయం బాతత్తడియఱుతఁ బెనచిపట్టి యొక్కకదళికాతరువునఁ గట్టివేసి దాని నరసికొని వచ్చుపౌఁజులరాక కెదురుచూచు చుండెను.

అంత నతిభీకరంబును బ్రతిభటదైన్యాకరంబు నగు శత్రుఘ్నునిసైన్యంబు వచ్చి యచ్చిఱుతవానిని వానిచే నాకృష్టం బై కట్టువడి యున్నయజ్ఞీయాశ్వంబునుం గాంచి దండితదండధరుం డగుదశకంధరుగండడంచిన చండకిరణకులునిసవనాశ్వంబుం బట్టినదుండగీఁ డెవఁ డనవుడు, లవుఁడు లూయమానాతిదృప్తశాత్రవుఁడుఁ వీక్షామాత్రవిపక్ష వీక్షాపాత్రినంద నుండు, జానకీపిృయనందనుండు, "వీఁ డొక్కబాలకుండు, అని తలపోసి పోరికిం గడంగి యేల నలంగెదరు. తొలంగి చనుఁడు." అని పలుకు వానిశూరవాక్యంబులు విని యాసైనికు లాగ్రహింపక యొండొరులం జూచి మందహాసంబు చేయుచు, ఎందుఁ గననివింత లిందు గంటి మనుచు, సైంధవబంధమో

చనంబు సేయం బోవ నే వల దన్న పనికిc దొడంగమీ రెంతవా రని వారనికోపంబున నాపాపండు కొందఱ నర్ధచంద్రవక్ర రంబుల నికృత్తకరులం జేసియు, కొందఱ వాcడినారసంబు లేసి విభిన్నహృదయులం జేసియు, రేసి నిలిచిన సేనాగ్రచరు లాగ్రహోదగ్రులై యుగ్రమూర్తులుంబోలెc గ్రాలుచు వీcడు పాఱుcడనియు, అందును బాలుం డనియు, ఆలంబునకుc జొరక యాలంబు సేసి యాఫలంబుc జేసేత ననుభవింపc బాలైతిమి. ఇంక శిక్షింపక యుపేక్షింపరాదు. అని శరాసనంబు లెక్కిడి యుక్కునారసంబులు పెక్కులు పరcగింప చిల్లరమూcకలును బురికొని కరవాల భిండివాల ముసలముద్గర కుంతక్షురికాముఖ ప్రహరణంబులంగుప్పించిరి. వానినెల్ల లవుండు లవంబునకుం గొనక నడుమనతుత్తుమురై పడc గత్తివాతియమ్ములు ముమ్మ రంబుగాcబ్రయోగించి, ఈర్ష్యాసూయ లతిశయిల్ల నక్షయ బాణంబులుతూణంబున వెలువడ నెడదెఱపి లేక యంపజడి గురియించినం బరసైన్యంబు దైన్యరసమగ్నం బయ్యె.

అంతc గడుదవ్వుల వచ్చుచున్న రామునిపిన్నతమ్ముండు శత్రుఘ్నునం గదియ వచ్చి యచ్చెఱుతవానిచే నొచ్చి పురివిచ్చిన బలంబులకుc జలంబుc దలకొలుపుచుం దలపడుటయు, సీతా సుతుం డాతంకంబు లేక వల్మీకసంభవునను గ్రహంబునం బడ సినవీరమాహేశ్వరమంత్రంబు పునశ్చరణంబు చేసి దానిచే శౌర్యసాహసంబు లక్షయంబులుగా నక్షయాశుగంబులం బఱపి

భరతానుజునకుఁ గవాటంబుఁ జేసె. దానంజేసి మాన సంబున నాశ్చర్యంబును మాత్సర్యంబును బెనంగొన శత్రుఘ్నుం డాశత్రుఘ్ను నవలోకించి కొంచెము నిదానించి వానియందు జానకిమొక్కట్లు గానరా నెదం గదిరినకరుణ పెంపునఁ గడుం గదియ నరదంబుఁ దోలించి "బాలకా! నీవెవరివాఁడవు, నీ పేరెయ్యది, దారిఁబోవువారునంబుఁ బట్టి యూరక మాబోఁటివారితోఁ బోరాడనేల? నిన్నుఁ జూడ నామనంబున జాలి యయ్యెఁడు. జోలిమాలినయీవిగ్రహంబు కంటె సర్వలోకపాలకుం డగురామభూపాలునియనుగ్రహంబు వడయుట మేలుగాఁ దలపోయుము. మూర్ఖత్వంబు వహింపక నవనహయంబు విడిచి మాబడిం జనుదెంచితివేని జనపాలునికి నీలావరితనంబు దెలిపి యాయనచేఁ బసవనంబు లిప్పించెద." అవిన విని జనకజాతనయుండు కనలి "జనవరా! అని సేయవచ్చి యిచ్చకంబులాడఁ జొచ్చెద విది తగునా? మగఁటిమి మెఱయింప నగుంగాక." అని మూఁడు వాఁడికోలలు నుదుటఁ గీలింపఁ గలియుంబోలె నాశత్రుఘ్నుండు మండిపడి "పడుచా చెడఁ దలఁచుకట్టెఁడులకు హితంబులు హితంబులు గావు. కావుకా వనుచుఁ గావరంబు దూలి శావం గోరునట్లు చేసెద. ఇంచుక తాళుకొనుము." అని బీరంబులాడుచు నాఱు నారసంబు లురంబు గాఁడ నేసిన నాలవుండు శ్రుతకీర్తిమగం డగ్రశుతకీర్తిగా నమర్షంబుఁ బెంచి దిక్కులు పిక్కటిల్ల నట్ట హాసంబు సేయుచు నొక్కయమ్మున సిడమ్మును, నొక్కనార

సంబున సారథిని, నాలుగేసియాశుగంబుల హయంబులఁ జక్ర
రక్షకులను దునుమాడి, రెండుకాండంబుల హృదయంబు భే
దించి, సింహనాదంబు చేసెను.

అంత శత్రుఘ్నుండు కృతఘ్నునియెడఁ బ్రయుక్తంబు
లైన యుపకృతులుంబోలె నీయన్ఘునెడం బ్రయుక్తంబులైన
యస్త్రశస్త్రంబులు నిరర్థకంబులై చనియె నని విచారించి
కరుణ చాలించి గెలుపుగొనువెర వూహించి తొల్లి రఘు
వల్లభుండు లవణాసురుం దెగటార్చ నేయస్త్రంబు ననుగ్ర
హించి యిచ్చెనాయస్త్రంబు నారిం గూర్చి బిట్టార్చి, "ఓరి
పాలుబుడుతా దుడుకు వలదన వినవైతివి. ఇదె నీప్రాణంబులు
గొనలేలిహానంబై వచ్చు దివ్యాస్త్రంబుఁ జూడుము. బాలుండ
వని, అందునుబాలుండవని, ఆలంబునఁగూలనేయఁజాలకయింత
వట్టునోర్చితి. ఇప్పుడేనియు బ్రతుకాశపడుదేని మిన్నక యనికిఁ
దొలంగి చనుము. నే నది కాదనను" అని పలుకులవణారిపలు
కుల కించుక శంకించియు, లవుండు బింకంబు సెడక యీయెడ
మాయన్న కుశుఁడున్నఁ దిన్నగ దీని నడఁచి పుచ్చునుగదా!
ఆజగజెట్టిశోకుపాటు గాంచ నిది యదను గాదయ్యె, అయిన
నేమాయె, మాయమ్మ యనుగ్రహమ్మునంజేసి యీయస్త్రంబు
నావలన నెట్టులేని యణఁపఁబడెడునని దిట్టతనంబు గైకొని
నిలువం గని, రామానుజుం డాయస్త్రరాజంబు తెగవాపెను.
అంత నది త్రిపురంబుల నేర్చుపాశుపతంబు చందంబున మండుచు
వచ్చి యాక్రమింప లవకుమారుం డకుమారుండునుం బోలె

నవక్రపరాక్రమఃంపై మాతల్లి పతివ్రతామతల్లి యగునేని దీన నీయస్త్రమ్ము వమ్మై చెడుంగాక యనుచు నొక్కబాణం బతఁడేసిన దాన నది ఖండితం బయ్యె నప్రతిహతం బగుటంజేసి యొక్కఖండంబు మిట్టించి వచ్చి సీతపట్టి కోదం డంబుఁ దుండించి అమ్మునం దూఁటి సామ్మగొనం జేసెను. అప్పుడు శత్రుఘ్నుండు శూరాగ్రేసరుం డగునాకుమారుని యవార్యశౌర్యంబునకుఁ జిత్తస్థైర్యంబునకు వెఱఁగందుచు సర గున సరదంబు డిగ్గి డగ్గఱ వచ్చి పరికించి చూచి యీయుక్కు నీనిక్కు నీతీరు నీసొరు నేపాఱులకుఁ గలదు? పోలించిచూడ వీఁడారామమూర్తియపరమూర్తియై కనుపట్టుచున్నవాఁడు. కావున నీవీరుని రఘువీరుని సన్నిధానంబుఁ జేర్చుట మేర యని వానియొడల నసలుకొని యున్న నెత్తురు గడిగి యెత్తి యరదంబున నిడుకొని భేరులు చెలంగఁ దురంగంబు విడిపించు కొని హతశేషు లగుసైనికులు శంఖంబులు పూరించుచు సింహనాదంబులు కావించుచు వెనువెంట నేతేర వీటిపిఱుందన నడవందొడంగెను. అంతట నది యంతయు దవ్వుల నిలిచి చూచుచున్న మునికుమారు లంతకుమున్న లవుండు పెందల కడ నింటికి రాక తడయుటకుం గడుఖిన్నులై గడియ లెన్ను కొనుచున్నపుడమికన్నె కడకుం జని "జననీ! మనలవుండు కుశ సమిత్పర్ణఫలాహరణార్థియై మావెంట గంగదరికి వచ్చి యచ్చే రువ మేయుచున్న యొక్కవారువంబుం బట్టి కదళికాతరువునం

గట్టి దానియొడయులు వచ్చి విడిచిపుచ్చు మన్న విడిపింపక తెంపు మెయి వారి నెదిరించి పెద్దతడవు పోరాడి యనేకులc దురుమాడి కడపటc జేతిధనువు దునియం జేయునది లేక యొక్కధనుర్ధరునికిం జిక్కెను. పెక్కు లేల యా మొక్కలుండు మే మెల్ల వలదు వలదు అన మాపలుకు లుల్లంఘించి యీ యాపదం బ్రాపించెను.” అని విన్నవించిరి.

అది విని యమ్ముదిత ఘనఘనాఘనగర్జానినాదంబు వినిన డూcడుదిండికన్నెయుం బోలె గుండియ లవియ మెండు కొనువేదనం దూలి సోలి యొప్పటి తెప్పిటి లవుం బలవుచుc దలంబుగానికొందలంబునకుc దావలంబై యుండె. అట్టియెడ దదాశ్రమంబు పొంత ఫలమూలసమిత్కుశపత్రపుష్పసంపాదన పరత్వంబునం బరవశుండై చరించుచున్న కుశుండు కొన్ని దుశ్శకునంబులం గాంచి శంకించి వామలూరుభవుం డాశ్రమంబున లేమి తలంచుకొని కనుకనిం బఱతెంచువాc డెదురc గొన్ని శుభ శకునంబులం గని మెదం గదిరిన యదవద గుదియc బర్ణ శాలc గదియ వచ్చి యచ్చటిమునికుమారులవలన లవకుమా రునివృత్తాంతంబు విని యెంతయు వంతం దురపిల్లుచున్న తల్లిc జేరి పెన్నిధిc గన్న పేదయుంబోలెc దన్నుc గని “అన్నా మనచిన్నియన్న యొక్కజన్నంపుc దత్తడిం బట్టి కట్టి యెత్తెఱుంగక యెత్తడింబడియె నcట. అంత నొక్కపాతకుండు వాని చేతివిలు విఱుగ నేసి గాసిc జేసి యెత్తికొని పోయెనcట.

కటకటా! యెటు లాముద్దుల గని నెడఁబాయుదు. నేనేమి
చేయుదు" అని పనవుజనని నూరార్చి కినుకఁ జేర్చి "తల్లీ
యెంతపనికైన నీకు వంత నొంద నేల? ఏలావరి మనబాలుం
బరిభవించె నాతనిరవంతలో నంతకుచెంత కనిచి ననిచిన
నెమ్మనమ్ముతోఁ దమ్మునిం దోడి తెచ్చెద. ఒచ్చెంబు లేక
యిచ్చపొదల మచ్చాపంబునమ్ములుఁ జేతఁ బుచ్చుకొని
దీవించి యిచ్చి పుచ్చుము." అనుటయు నాయమ వనటమూని
బాణబాణాసనాసిగదాముసల ముద్గరప్రముఖనిఖిలాయుధంబుల
ను దనచేత ముట్టి "దిట్టవై యరుల మట్టుపెట్టి జయలక్ష్మిం
జేపట్టుము. లవునిం గొనివచ్చి నాయెదుటఁ బెట్టుము." అనిదీవించి
యిచ్చినం గైకొని తల్లికి వలగొని మ్రొక్కి యక్కడిందిబంటు,
కవచంబు ధరించి కవదొనలలవరించి వింటినారి యెక్కించి
మదగజంబులపదవుఁ బొడువం బోవుసింగంపుఁగొదమభంగి
నింగి యగల నార్చుచు యానవేగంబునం జేసి నిజపదఘట్టనం
బులఁ దరువులు విఱిగిపడ గిరులు తుత్తునురుగాఁ బఱతేర
నాకుమారవరుం జూచి యానకొని కదియు వచ్చుబెబ్బులిం
గనుంగొనినమేఁకమందచందంబున మూఁక లెల్ల నుబ్బుచెడి
పాఱం జొచ్చెను. అది గాంచి శత్రుఘాతిసేనాపతి నదలించి
యిది యేమి గూఁగడంబు బాగునోగు విచారింపక యొక్క
మునికుమారు విగతపరివారు దూరంబున రాఁ గని కలని కుత్స
హింపక బలం బెల్లఁ బలాయనపరాయణం బయ్యె. నీవును
దయ్యంబు సోఁకినవానివిధంబున పథంబు దప్పి నిలిచెను. మన

మగతనం బింక నెన్నటికి? క్రొన్నన బలంబుల మరలించి నిలువ
రించి ప్రతివీరు నణుమ నుంకింపుము. శంకింపం బోకుము. అని
తానును గట్టాయితంబై నిలిచె. అప్పుడు పుడమిపట్టి నడవి
పాలు సేసినదోసంబు వాసరాధిపవంశనిరోధంబునకుం దొడం
గుట సూచించెడునో యనం బుడమి చలించె. ఉఱుమకయ
పిడుగులు పడియె. బలంబునలువలంకుల బలసి వఱళ్లు వాపో
వం జొచ్చె. కైదువులు తమంత గవుసెనలవెలువడి విఱిగిపడం
దొడంగె. కాకఘూకసముదయంబులు భయంబులు దక్కి
రథికవరుల శిరంబుల నిరవుకొన సాగె. పడగలతుకుల మిన్న
కయ పొగ లెగయ నయ్యె. బిరుదుమగలకు మగంటిమి యెరవ
య్యె. అట్టియెడ సేనావాహుం డాహవదోహలి యై నిజవాహి
నులం బురికొలిపి యేలినవాండు మేలుమేలన యుగాంతకాలం
బునలోకంబుల నాలోకానలంబునంగాల్చు చిచ్చఱకంటియుచ్చు
నంగదియ వచ్చులవునియన్నం దలపడియెను. తోడన దడంబు
లుం బురికొని తోడ్డై వెన్నుదన్ని నిలిచెను. దానం జేసి
కుశుండు రేసి నిశితశరంబులు పరంగించి సరథరథ్యసారథి
కంబుగా సేనానిం దునుమాడెను. అంత నాతని సోదరుం
డగుం డనువాం డగంబునుం బోనిమదనాగంబు నారోహించి
వాహినులం దలమీఱి సీతాకుమారు నెదిరి యెల్ల లోకంబుల
నొక్క త్రేల్మిడిం జీకాకుపఱుపం జాలునొక్క శక్తిం బ్రయో
గింప కుశుండు దాని మూడుబాణంబుల నడుమన తునుమాడి
వెండియుం గాండపంచకంబున వానివేదండంబు తొండంబుతోడ

నాలుగుకాళ్లు ద్రెంచెను. అగుండు నది మ్రొగ్గతిలకమున్న యగంబునుండి దిగువకు నుఱుకు మృగలాజు రేఖ భీకరగదా దండమండితకరుం డై ధరణికి నుఱికి కుశుం గదిసెను. అంత నబ్బిరుదుమగండు గుదియతోన వానిచేయి తునియనేసి వాఁడరవాయిగొనక పెఱచేతఁ జక్రంబు గొని తటిమిగాఁ దొల్లింటియట్లు యాకేలుఁ దెగనేసెను. అంతకును వెనుకడుగు పెట్టక గ్రహరాజుఁ బట్టఁ గదియురాహువు ననుకరించుచు నోరు దెఱచికొని తనుఁ గదియ వచ్చునగుం గని కుశుండు మందహాసము సేయుచునొక్కకత్తివాతియమ్మున వానికుత్తుకయుగత్తిరించెను.

ఇవ్విధంబున నగునిఁ జిత్రవధ చేసి విలయకాల కాలుండునుంబోలెఁ గ్రాలుచున్న తన్నుఁ గని వెఱచి పఱచు కరితురగపదాతివర్గంబు ననర్గళంబుగాఁ దటిమితటిమి నుఱుము సేయం జొచ్చిన నయ్యాటోపంబు సైరింప నోపక దాశరథి నిజరథంబురవడిం దోలించి "ఓ బాలకా ముఱిచెడి పాఱువారిం గాఱింపనేల ? మగఁటిమిగలదేని తొలఁగక నాతోడం బోరాడ రమ్ము. పిఱుతివియక పోరం జాలినబిరుదుమగల నాఁగి సరితూఁగినం గదా బాగు." అని పలుకుచు నశనిసంకాశంబులగునాశుగంబు లాశుగతిం బఱపి కుశుని నిలువరించెను. పదంపడి యాకుమారవరుండు లక్ష్మణావరజు నెదిర్చి పేర్చిన యాటోపంబున నతనిశతాంగంబు తురంగసహితంబుగా నుఱుముసేసి యొక్కములికి యలికంబునం గీలించి సోలించి మఱియు నాలుగుశరంబు లురంబునం గ్రుచ్చిన నతండు దిమ్మ

దిరిగి సామ్మగొని యవనిం ద్రెళ్లెను. తోడన హతశేష సైన్యంబు దైన్యాధీనం బై చెల్లాచెదరుగఁ బఱచెను. అంత బృందారకబృందంబులు మందారకుసుమంబులు వర్షించిరి. లవుం డాపూవులవానచేఁ దనువునం దను పొలయ మూర్ఛ వలనం దేఱి యన్నం జేర వచ్చెను. అది గని కుశుండు మది పొదల నాలంబు చాలించి మారుతునితోడుపాటు గనినకారు చిచ్చునోజం దేజరిల్లుచు మఖవాజి నరసి పట్టి తెచ్చి యెప్పటి కదళీతరువునం గట్టి తమ్ముని నెమ్మిం గౌఁగిలించుకొని సముచితాలాపగోష్ఠిం దుష్టి నొందించెను.

అట కలనికిం దొలంగిపాఱినభటనివహంబు పటు రయంబున నయోధ్యఁ దఱిసి యాగశాలాప్రవేశంబు చేసి హయమేధదీక్షవహించి యజ్ఞవేదికా సమాసీనుం డును, అనుజన్మసేవ్యమానుండును, కురంగశృంగహస్తుండును, సారంగచర్మవాసఃప్రశస్తుండును, శాతకుంభసీతాకళత్రుండును, హోమధూమావిలారక్తనేత్రుండును అయి మునిగణసభా మధ్యంబున వినోదగోష్ఠి నున్నరామదేవుని సన్నిధి వడసి కృతప్రణాములై వికృతస్వరంబునఁ దమకొందలపాటును, గుఱ్ఱంబుతగులుపాటును, శత్రుఘ్నాదుల కోలుపాటును, దెలియ విన్నవింప విని గుండెలు పగిలి దండనున్న భరతలక్ష్మణుల నవలోకించి "వింటిరా! ఈబంటులాడు వింత మాటలు, లవణాసురునంతవాని నెక్కటియై యుక్కడంచిన యుక్కుఁదునియ యొక్కమునితనయునికిఁ జిక్కి స్రుక్కెనఁట."

అనుటయు, లక్ష్మణుండు "అది యెక్కడిమాట, ఉక్కెక్కిన సింగంబు నెదిరి నక్కపిల్ల భంగపెట్టం జాలునా? చెంగి చెంగి పఱచుంగాక. ఈపిరికిబంటులం దెవ్వరో త మ్మదలింప బెదరి వచ్చి నోటికి వచ్చినట్లు వదరుచున్నారు. అంతియకాని యొక్క పాఱువానికి బవరంబున లవణాంతకుం జెనయ వచ్చునా?" అని మందలించెను. అది యా భటులు విని గుండెలు తటతట కొట్టుకొనఁగా, "ఓ జేఁడా మా మనవియనాదరంబు సేయవలదు. కలనం దమతమ్మునిమునిబాలకులుమువ్వాటికిగూలనేసిరి అందుఁ దొలుతఁ దురంగంబుఁ బట్టినబాలకుండు నిఖిలసైనికులం గొట్టి గిట్టించి తుదకు మీ తమ్మునిచేఁ బట్టువడియెను. పిదప వానికి నాప్తబంధు వగునింకొక్కమునితనయుండు ధనుర్ధరుండై వచ్చి చతురంగంబుల నఱుము సేసి శత్రుఘ్నుం బడ నేసెను. ఆకుమారులపోలిక చూడ మీతీరుననే యున్నయది. ఇంతపట్టు నిక్కవంబు సుఁడీ." అని మొఱలిడుటయు, రఘువరుండు శత్రుఘ్ననామంబు సార్థకంబుగా వహించిన నాతమ్ముఁడు సహితులచేత నిహతుండయ్యెనా? ఏమి దైవం బొనర్చుచిన్నెలు? అని మనంబు చలింపఁ జిత్రరూపంబునట్లు కదలక మెదలక యెలుంగుపడి పలుకనేరక యూరకుండి కొంం డొకవడికిఁ దెలి వొందియు నెదం బొడముసుడుకు నడఁపలేక నాయునా! పాయనిభక్తిం గడునడంకువ దోఁప నాపనుపు సేయు చుండు దువు. పలుదెఱచి మాఱుపలుక నోడుదువు. కట్టెదుట నిలిచియైన నెఱుఁగవు. అగ్గి నఱుకు మన్న నెగ్గనవు.

అతివినయపరు నసహాయశూరు నొక్కపాలుబుడుతకు దార
వోసి జాలిఁబడం బాలైతి. శత్రుఘ్నా! ఇఁక నేరీతి నరాతి
మృతినొందు. వీతి నెట్లు గొందు. క్రతు వేక్రియఁ బరిసమాప్తి
నొందు ఏగతి సద్గతిఁ గందు. అని సర్వజ్ఞుం డయ్యు నజ్ఞునట్లు
పలుదెఱఁగుల వగచి వగచి తగవు విచారించి తాలిమి
వహించి లక్ష్మణుం గాంచి "తమ్ముఁడా! క్రతు దీక్షవహించుటం
జేసి నాకు నిచ్చోటనుండి కదలరాదు. కదలకున్న మదవదరి
మర్దనంబున కనువు గాదు. అరివరుల గెలువక తురంగంబు
రాఁబోదు. తురంగమంబు రాకున్న జన్నంబు నెఱవేఱదు.
కావుననీవు చతురంగబలంబులం గూర్చుకొని యిప్పుడ కదలి
కదనరంగంబుఁ జేరి యెట్టులేనియు నామునిదారకుల దోరింపక
పట్టుకొని శత్రుఘ్నునితోడ రథంబునం బెట్టుకొని క్రతు
హయంబుఁ బట్టుకొని రమ్ము వేవేగ పొమ్ము" అని యాన
తిచ్చెను.

అంత లక్ష్మణుండు నడగొండలవడువున దండి మిగులు
వేదండకాండంబులును, నడవడిం గరుడానిలుల మెచ్చనితత్త
డులును, శరద్ఘనంబు లన ఘనమార్గసంసర్గంబునం దుఱంగ
లించు శతాంగంబులును, సింహకిశోరంబులకరణి నరిభటకరటి
పాటనపటువు లగువీరభటులునుం, గల మూఁడక్షౌహిణుల
బలంబు తనకుఁ దోడుగాఁ గొని యన్నకు నన్నతి చేసి మిన్నం
టినకరళ్లచప్పుళ్లతోఁ జెల్లెలికట్ట దాఁటి వచ్చుమున్నీటికిం
బాటి యై శీఘ్రయానంబున ననుగమించుసేనలుం దానును

గదలి గంగదరికి నరిగి, ఆ చేరువ వామలూరుభవు నాశ్రమం
బున కనతిదూరంబునం గనుపట్టు సమరాంగణంబుఁ జొచ్చి,
అందు వీడి చిక్కువడి నిడువాటునం బడినశిరోజంబులు నీలి
పటపున ట్లొప్ప వీరశయ్యాశయనుం డై యలసి నిదురించు
వాఁడునుంబోలె నున్నతమ్మునిం గనుంగొని నెమ్మనమ్మున
నుమ్మలమ్ము పెరుగ నేమియుఁ దోఁచక తల యూఁచుచు
నిలువంబడియెను. హయంబుఁ బట్టి కదళీతరువునం గట్టి కాపె
ట్టుకొని యుండుపుడమిపట్టికొడుకు లాతని నతనిసేనలనుం గనిరి.
అప్పుడు కుశుండు లవునితో నిట్లనియె.

"తమ్ముఁడా! చూడుము. ప్రతిబలంబులు నేల గోడి
వడం జనుదెంచెను. మనతోడఁ బోరి మడిసినపుడమిాశుం జేరి
విచారపడుచున్న వాఁడు వానికి నాయకుండు. ఈయెడ మనకుఁ
గరణీయం బేయది. చెప్పుము." అనవుడు లవుఁడు "చెప్పెడి
దేమి? వీరిరాక మనతోడి పోరాటకుఁగాని మనలఁ గొనిపూ
టకుఁ గాదు. అందులకు మనము వెనుదీయుటయుఁ బాటి
గాదు. కావున నీ వీవాపురంబుఁ గావుము. నే విరోధివరూధినిం
దలపడి మురి యడంచెద." అని వచించి మునువు తనధనువు
శత్రుఘ్నునిచే భగ్నంబగుట భావించి నియమపురస్సరంబుగా
దివాకరు నారాధించి భక్తియుక్తి బద్ధాంజలియగుచు.

తే. "సవిత మూర్తిత్రయాత్మక సప్తతురగ
చండ పూష సతామర జలజమిత్ర

హంస ఋగ్వేదరూప మేషాద్యధీశ
ఖపత్రికాశ హిరణ్మయ కర్మసాక్షి."

లయగ్రాహి.

"భాస్కర భవామయతిరస్కర నమజ్జనయశస్కర సహస్ర
కర మస్కరధర శ్రే
యస్కర తభోమణి యహస్కర చరచ్ఛరదుపస్కర సదా
రుణపురస్కర వదేశా
పస్కర తమఃపటలతస్కర కిరీటగ శిరస్కరగృహీతసున
మస్కర సహారో
రస్క రజనీపసవయస్క రవి సర్వజగదాస్కర భజే యని
నమస్కరణుఁ డైనన్."

సూర్యుండు ప్రసన్నుండై యాశౌర్యనిధికి నమోఘం బగుహైమచాపంబు నొసంగి కనుమొఱఁగెను. అట్లు నిజగురుం డగువరుణనందనుం డనుగ్రహించిన సౌరమంత్ర ప్రభావంబునం జేసి భానునివలన బాణాసనంబు వడసి దానిమహిమం బన్నకుఁ జెప్పుచు నప్పటికిఁ బురికొని కినుక మెయి ననికిఁ బైకొని వచ్చు లక్ష్మణుం దాఁకెను. తోడఁ గుశుండునుం దోడుపడియె. ఆత లపాటునఁ గూర్మగ్రాహకుళీర ప్రముఖజలచరసంచారఘోరం బైనసముద్రంబునుంబోలె రథగజతురగపదాతిసంయుతం బై మిగులఁ బలుపు గలిగి మెఱయు చున్నయాసైన్యంబు కుశలవ నామకమందరమైనాకంబులు గలంపం గలంగుండుపడి తుత్రుటికా లంబునఁ గీలాభీలం బయ్యె. అట్టియెడ సేనాపతి యగు కాలజ

త్తనువాఁడు లయకాలకాలుండునుంబోలె నాభీలుండై బలం
బులం గలంగ నీక యాఁగి లక్ష్మణునకు సహాయుండై కుశుని
మాఱుకొనుడును, సైనికులెల్ల నలవుమెయి లవునాక్రమించిరి.
దానంజేసి లవుండు పదతాడితభుజంగంబుచందంబున మిట్టిపడి
సంవర్తమేఘంబుపెల్లున గర్జిల్లుచు శక్రశరాసనంబులీల నిజబా
ణాసనంబు కేలఁ గ్రాల శరధారావర్షంబు గురిసి యరిబలంబు
నెత్తుటివెల్లిం దేలించి కెలంకు లవలోకించి కుశునిం గాంచలేక
యించుక నిదానించి నిలిచెను. అట్టియెడం దొల్లి రాఘవుని
శరణు చొచ్చి యతనిబంటై యుండి లక్ష్మణునితోడ వచ్చి
యున్నలవణాసురునిమాతులుండు రుధిరాక్షుం డనునసురుండు
నిజమాయాబలంబున లవు నేమఱించి సూర్యదత్తం బైన
విల్లొడిసి పుచ్చుకొని యాకసంబునకు నెగసెను.

అట్లు శరాసనంబు పరాపహృతం బగుటయు, ధరా
కుమారీకుమారకుండు కొండలంబు నొందక డెందంబునం దాలి
మి పాదు కొలిపి చక్రధరుండై యాచక్రధరుండునుం బోలెఁ
గ్రాలుచు మరున్మంత్రపురశ్చరణంబు చేసి యామంత్రబలం
బున మింటి కెగసి కపోతంబునకుం గవియుడాలెడేగయనువున
నయ్యసురునకుం గవియుడును, దైత్యసైనిక నికరంబంతయుఁ బర
మసాహసికుం డగుసీబిరుదుమగం డెవరిపై నుఱుకునో యని
వెఱపు నొంది యొకంకి బొందులమఱుంగున జుణుంగువారును
ఒక్కొక్కచక్రంబు వికలంబుగా నొడ్డగిలం బడినయరదంబుల
క్రిందఁ దూఱి యొదుంగువారును, వారువంపు మొండెంబులఁ

దొలంగఁ ద్రోచి వానిపక్కెర లూడ్చి పైఁ గప్పికొని యడం
గువారును, మానిసియట్టలతిట్టలమాటున కేడెంబులు మాటె
డుకొని ముడుంగువారును, అయి యాత్మత్రాణ పరాయణ
త్వంబునఁ గళవళింపం దొడంగిరి. ఆరభసంబు గనుంగొని
సుమంత్రుని కొడుకులు సింహుఁడు, చంద్రుండు, కాలుండు,
ధార్మికుండు, మదనుండు, శత్రుసూదనుండు, జితశత్రుండు,
అమలుండు, శరన్నదుండు, సుకేతుండును, అనం బరఁగిన
పదుగురు తెగుదారు లుదారవిక్రము లై తమసింహనాదంబు
లును ధనుష్టంకారనాదంబులును గలసి దిగ్దంతులకుఁ జెవుడు
పుట్టింప నొక్కపెట్ట బాణపరంపరలు పరఁగించి లవునిఁ గలఁత
నొందించి వానిచేతిచక్రంబుఁ ద్రుంచిరి. అంతట లవుఁ డిలకు
నఱికి లవుఁడి గొని వారల నందఱఁ దలలు పగుల నడిచి పొలి
యించి యొప్పటియసురునివలనికి నిగుడుటయు వాఁడు కడునడిం
గుదియఁ గొని లవునిశిరం బదుర నడిచెను. దానంజేసి యక్కు
మారవరుండు విసంజ్ఞుఁ డై నేల కొఱిగి యంతన తెలివొంది
లేచి కుంతంబుఁ గొని దానవునిగొంతుక తెగిపడఁ బొడిచి
వానిచే నపహృతం బైనచాపంబుఁ గై కొనియెను.

ఇవ్విధంబున దై తేయుంబొరిగొని ధనుర్ధరుఁ డై నిలిచిన
సై తేయునాటోపంబు సహింపక వానివారలెల్ల గుములై
తల్లిగర్భంబువలన నవతరించునర్భకుం బొదువు మాయాతమం
బునుంబోలెఁ బొదువుటయు, అబ్బాలుండు చలింపక సుజ్ఞాన
దవానలంబునం జేసి మోహావికారనీరసాటవుల దహించి వెలుఁ

గొందుమహాయోగిభాగుసను మూఁగిన మూఁకం బొడ పడంచి మించినకడిమిం జెంగలించి నిలిచెను.

కుశుండును వీరావేశంబున లక్ష్మణు నెదిర్చిన సతండు శరపంచకంబున నాకుమారశేఖరునురంబు భేదించి నొప్పించెను. దానంజేసి యాపాపఁడు కాలితాఁపున నేసరేఁగులేలి హానంబుచందంబునం గెరలి బిరుదుమగండవేని తెరలక నిలువుమని పలుకుచు మరుచ్ఛరం బఱింబోసి తెగ నిండఁ దీసి యేసిన దానివలన మహావాయు వుప్పతిల్లి నరథ్యరథిసారథికంబుగా నాదాశరథిరథంబు కుమ్మరసారెతెఱంగున దిరదిరఁ దిరుగఁ జేయ నయ్యురవడికి నోపక తురంగంబులు మరణింప నెట్టకేలకు సారథియుం దాను నాదెప్పరంబుఁ దప్పించుకొని యిల కుఱికి లక్ష్మణుండు వెండియు నొక్కరథం బెక్కి దిక్కులు భేదిల్ల నార్చుచుఁ బేర్చినకోపంబున రోపపంచకంబు నిగిడించి కుశునికవచంబు చించి కిరీటంబు ధరఁ దొరగించిన, అతండు ముక్తకంచుకం బగునురగంబు ననుకరించుచు రామానుజుం గనుంగొని, "నరవరా! మోఁతచేటుగ నున్నకవచకిరీటంబుల దొలఁగించి మేలుచేసితివి. ఇందులకుఁ దగిన మఱుమేలు చేయుమి నెనరు కలవాని తెఱంగుగాదు. కావున నాదగు వింటినేర్పు మెఱయించి నీసైన్యభారంబు దించి కృతజ్ఞత వహించెద. ఇంచుక తాళుకొనుము." అనిచెప్పి సమంత్రకంబుగా నాగ్నేయాస్త్రంబుఁ బ్రయోగించెను.

అది నెఱమంటలఁ జూపఱకు వెఱపు పుట్టించుచు నాక్రమింప నొడళ్లు కమలి విలవిలఁ దన్నుకొనుచు నిలఁబడు తత్తడులును, మేనుల మంట లెగయ నెరగలి దరికొన్న పెను గొండలవడువునం గనుపట్టుచుఁ జట్టువడిన యేనుఁగులును, కాలి రూపు చెడి పొడియగుచుఁ గఱుకు పొడియంగునం గాన వచ్చు శతాంగంబులును, జ్వాలామాలికలం బ్రేలి నిలువున నీఱైకూలు కాలుబలంబును, అయి చతురంగబలంబులు గొడుగులు పడగలు వింజామరంబులు మంజులాభరణం బులు లోనగు వానితోడ భగ్నంబులైనంగని లక్ష్మణుం డ య్యగ్నిదేవుం డునుంబోలె మండిపడి యద్దారుణాస్త్రంబు పోఁడిమి వారుణాస్త్రంబున నడంచినఁ గుశుం డాశుగతి నాశుగాశుగంబుఁ బ్రయోగించి సేనం దూలించెను. అప్పుడు సేనాధ్యక్షుం డగు కాలజిత్తుఁడు దర్పంబున నాకుమారవరు నెదిర్చి మూఁడువాఁడినారసంబు లెద గ్రుచ్చి యిచ్చవడం జేసి నవ్వుచు, "బాలుఁడా! కొలంది యెఱుంగక బలవంతుల తోడి పోరాటమునం జొచ్చితివి. ఇఁక నైన మొఱకవై చెడక కలని కెడ గలుఁగ దొలంగి చనుము." అనవుడును, కుశుండు కోపవివశుం డై "ఊరక వ్రేల నిచ్చినం బ్రేలవే" అనుచు నొక్కకత్తి వాతియమ్మున వానియుత్తమాంగంబుఁ దెగనేసి లక్ష్మణుదిక్కు మొగంబై నిలిచెను. అంత లక్ష్మణుండు క్రోధ ఘూర్ణమాన మానసుం డగుచు శూల చక్రముసల ముద్గర భిండివాల కరవాలప్రముఖ ప్రహరణంబు లేసిన వాని నెల్లఁ

గుశుండు నడుమన తునిసి పడ నేసి తనకు వాల్మీకి యనుగ్ర హించి యిచ్చిన సర్వశత్రుసంహారణధురీణం బగు బాణపంచ కంబు నొక్కయూఁకునం బ్రయోగించి యాకాకుత్థ్సునురంబు భేదింప వివశుండై యతండు నిస్తేజుండై యస్తమించు దినకరు ననుకరించుచు నరదంబు పయిం బడియెను. దానం దనివి సనక పుడమిపట్టిపట్టి ఖిట్టు చెలరేఁగి కత్తియుఁ గేడెంబును బూని తనతమ్ముని గ్రమ్ముకొన్న యేనుంగుగమికిం గవిసిపవిగొని యవితతిం బక్షవిచ్ఛేదంబు చేసి కూల్చు దివస్పతిచెలువున నవయవంబు లివి యివి యని యేర్పఱుప నలవడ కుండఁ జెక్కలు వాయ నఱికి ధరం గూల్చి నిల్చినబలంబుఁ బలా యనంబు నొందించి తమ్మునితోడం గూడి యేతరువునఁ దురం గంబుఁ గట్టి వేసి యాతరువునండఁ జేరి కూర్చుండెను.

అట రాఘవుండు, లక్ష్మణుండు రాక తడయుటకుఁ గారణం బారయ వేఁడి భరతునిం గనుంగొని, " తమ్ముఁడా క్రతు వుపక్రమింప నింక మూఁడుదినములె వ్యవధియున్న యది. ఇంతపర్యంతంబు లక్ష్మణుండు రాఁడయ్యెను. శత్రుఘ్నునిఁ బారిగొన్న బాలకు లెవ్వరో! యెట్టివారో ఎఱుఁగరాదు. వారు మొఱకులై పోరాటకుంజొర, వారల తల్లివచ్చి లక్ష్మణుం బుత్ర భిక్ష వేఁడ, శిక్షింపఁబోక మల్లాడెడినో! ఆటోపంబు దీపింపఁ బోరుటం జేసి వారువంబుఁ గొనిరా నయితి గాదయ్యెనో! తెలియఁబడదు. కావున నీవిప్పుడు వెరవరు లగువేగరులం బుచ్చి యచ్చటివృత్తాంతంబుఁ దెలిసికొనుము." అని యాన

లిచ్చుటయు, భరతుం డట్లయగుం గాక యని యప్పుడ నలువురు జంఘాలుర రావించి "మీరు పోయి లక్ష్మణుం గాంచి హయచోరకు లగు బాలకు లెట్టిబెట్టిదు లేనియు వారితోఁ దడవు పోరాడక నొంపక చంపక సమ్మోహ నాస్త్రప్రయోగంబున మోహితులం జేసి తీసికొని రమ్మనుఁడు, అట్లుగాక కోపావేశంబునం జేసి చంపు నెడ నరవరునియానతి మీఱినవార మగుదు మనుఁడు, ఆకుమారులు మనయేలినవాని పోలికనున్నవారని శాంరులు పెక్కండ్రువచ్చి పెక్కుదెఱఁగుల విన్నవించిరి. కావునఁ బ్రతిభటు లని యావటువులం జంప రా దన్న యన్నమాట మఱవఁబోకు మనుఁడు." అని యిట్లు సెల విచ్చుచుండుననవసరంబున, హతశేషు లగుభటులు గొందఱు తమ కాయంబుల గాయంబులవెంట నెత్తురు లుప్పతిల్లి వెల్లి గొని పాఱఁ గన్నీరు ధారలై కాఱ వెఱపునం బాఱుతెంచి రఘువీరుమ్రోలఁ జాగిలఁబడి, "ఓ పుడమిఱేఁడ! మీ రెండవ తమ్ముండును గాలజిత్తులోనుగాఁ గలప పడవాళ్ళతోడ ముని కుమారులతోఁ బోరాడి మడిసెను. ఆకుమారు లింక నిచ్చటి కిని రాఁగల రని తోఁచెడిని. వచ్చిరేని యూరక మరలఁబోరు. వారు కడు బెట్టిదులు. కాఁబట్టి యీపట్టునఁ దగిన వెరవు విచారించి యాకుమారుల మట్టుపెట్టుటయు నీతి. అట్లు చేయ కున్న నిఁక నెక్కడి నీతి. క్రతుభంగ మవుటెమి బాఁతి. వేవేగ బ్రతుకుదెరువు విచారింపుఁడు. చిచ్చెగయం జేటం గ్రమ్మ నగునా?" అని యుక్తాయుక్తవిచారంబు దక్కి లెం డనుమాట

తక్క వేఱొండుమాట లేక తత్తరపాటునం గుత్తుక లెండ మొఱలిడం దొడంగిరి. దానంజేసి రామచంద్రుం డేమియుం దోంచక లక్ష్మణా లక్ష్మణా యనుచు మొద లంటనఱకంబడిన తరువువడువున నేల కొఱిగి మూర్ఛిల్లినం జూచి భరతుండు గురుతరవిచారుం డగుచు నుచితోపచారంబుల దగారమణునిం దేర్చి యూరార్చిన నొక్కింత యూరడిల్లి లోకపాలురకును దలయెత్తి చూడరాని యింద్రజిత్తుం దునుమాడి నాకు గెలుపొనంగూర్చిన ప్రియానుజన్ము నేం డీవిప్రకుమారులచేం గోలుపోయితి. ఇంక నీయాగంబును రాజ్యభోగంబు నేల? ప్రాణత్యాగంబ మేలుగాక. అని పలవరించుచు సలువలంకులుం బరికించి భరతువలనికిం జూడ్కులు నిగిడించి "తమ్ముండా విల్లు నమ్ములుం దెమ్ము. తమ్ములు చనినయెడకు నేనును జనియెద. నీ విమ్మునుల యనుమతిని రాజ్య మ్మేలుకొమ్ము." అని పలుకు నన్న పలుకులు తనచెవులకు వాండిములుకులు సొనిపినట్లగుటయు, భరతుండు కరంబు కినుక దెచ్చుకొని "నరవరా! పాలుంబోతులు కొందఱు పాఱి వచ్చి నోంకొలందు లాడం దలరి పాడిదప్పినమాట లాడం జెల్లునా? మిత్రకులపవిత్రు లగు నా సౌమిత్రులు చచ్చిరను టెక్కడిమాట. అమిత్రఘ్ను లగు వారు తుములసమరంబున డస్సి మూర్ఛిల్లి యుండుదురు. అది చావుగా నెంచి యీవెంగలిబంటులు సంగరాంగణంబున నిలువ నోడి యిటవచ్చి పిచ్చికూంతలు కూసెదరు. వలయునేని నన్నంపుము. నేను బోయి తమ్ములకుం దోడుపడి యీపాటు

బుడుతలం బట్టి తెచ్చెద." అనవుడు రాఘవుం డుల్లసిల్లి భర తునుల్లంబు చల్లవడఁ గౌఁగలించుకొని "సుగ్రీవవిభీషణులు దక్షుం దక్కిన నరవానరదానవవీరుల నెల్లఁ దోడుచేసికొని చని గెలుపుగొని రమ్ము." అని యానతిచ్చెను. కైకేయీ నందనుం డట్లయగుం గాక యని సబలుం డై బృందారక చమూసమేతుం డగుపురందరునిచందంబున వెలుఁగొందుచు సర్వాయుధసంగతం బగుశతాంగంబు నెక్కి దిక్కులు భేదిల్ల శంఖంబు పూరించి కదలి గంగాతటంబున కరిగి యాచేరువ నతిభయంకరం బై కనుపట్టు రణరంగంబుఁ గనుంగొని యాంజనేయుం బిలిచి "కలనఁ బడి యుండుసౌమిత్రుల నిచ్చటికిఁ గొనిరమ్ము" అని, అతం డట్లచేయుటయు వారల యాకారంబులారం గాంచి, ఇంచుక చింతించి, నాఁడింద్ర జిత్తుం జంపి రావణునిశక్తిపెంపున సోలినప్పుడును లక్ష్మణుం డింతయొప్పమాలినవాఁడు కాఁడని విన్నవించు నాంజనేయుని పలుకు లాలకించి, ఇట్టిశూరుల నిట్టిపాటుపఱిచిన వారిం బృందారకు లనవలయుఁ గాని మునిదారకు లనరాదు. అయిన నేమి ? రామానుగ్రహంబు వడసినమనకు విగ్రహంబున నోర్వ రానివారు కానేరరు. అని కినుక పెచ్చువెరుగ సైనికుల మోహరింపం బంచి శంఖంబు పూరించుటయు, అయ్యారా వంబు విని కుశకుమారుండు లవు నెచ్చరించి వింటినారి సారించి సింహనాదంబు గావించెను. ఇంతలో నమ్మహావీరుల యాహవంబు కడుదారుణం బగుటఁ జూడ నోడి మఱుఁగువడి.

చనియెనోయన నినుం డస్తగతుం డయ్యె. ప్రళయకాలా
నలంబునుంబోలెఁ బ్రజ్వరిల్లుకుశలవులకోపానలంబు జ్వాలా
భీలంబై మింటికెగఁబ్రాఁకెడినో యన సాంధ్యరాగం బపర
దిగ్భాగంబు నలంకరించె. ఖగనిచయంబులు తెగలు తెగలుగఁ
బాఱి కలకలధ్వనులు మిన్నుముట్టం గులాయంబు లాశ్ర
యించె. కరి కిరి కాసరాది దుష్టమృగంబు లద్రిగుహాకుహరం
బులు వెలువడి విచ్చలవిడిం జరింప సాగె. పుడమికూఁతు
నగవిపాలు చేసినకృపారహితులకనులు గానరానివచ్చునే
యని యెల్లయెడల నల్లుకొనియెనో యన నంధకారంబు కాఱు
కొనియె. అట్టియెడఁ గుశలకుమారులు ధైర్యంబె పరమసాధ
నంబుగాఁ బ్రతివీరుల మాఱుకొని మెఱుఁగుటలుఁగులవెలుఁ
గునం గాఱుకొనువిరులు తొలంగి పాఱఁ బరస్పరానులోక
నంబులు చేసికొనుచుం బోరం దొడంగిరి. అందు లవకుమా
రుండు విజృంభించి వాఁడిగొడ్డంటుఁ గట్టియులు నఱకు నెఱ
మానిసితెఱంగునఁ గరవాలంబు గొని కరులకరదంతంబులు
తెగ నఱకుచుండ, కుశుండాకత్తి తళతళఁ వెలుఁగున తేలి
హానంబులుంబోనిబాణంబుల సైనికులప్రాణంబులు గొనం
జొచ్చెను. అప్పుడు భరతుండు తనలో వీరలయాటోపంబును
సైనికులపాటునుం దలపోసి చూడ నామనంబునఁ గలఁతపాటు
నెక్కొనియెడు. ఇందుల కేమి సేయునగు ననుకొనుచు నాంజ
నేయునితో విచారింప, అతండు "వీర లారామదేవునట్లు నాకుఁ
గాన్పించు చున్నవారు. రాముసంతటి వారికిఁ గాక యితరులకు

మనమూఁక నిట్లు పఱుపఁ దరముగాదు. కావున వీరిపుట్టు పూర్వోత్తరము లడిగి తెలిసికొని తగినవెరవు విచారించుట మేలు." అని విన్నవించెను. ఆపలుకులు కుశుండు విని లవుం జూచి, "వింటివా వారాడుకొనుమాటలు, ఆమాటలతెఱంగు చూడ నెఱిదప్పినచందంబు గాన నయ్యెడి. నీవిఁక నాలంబు చాలించి హాయంబు నేమఱక కాచి యుండుము. ఈసేన నంతయు నే నొక్కండన మసిమిడి తునుమాడెద." అని చెప్పి భరతుం గదియఁ బోయి "నిన్ను నీసోదరులకుఁ దోడు పంప దైవంబు ప్రేరేఁచి తెచ్చెఁగాఁబోలు. లేకున్న నీవేల యిట వత్తువు." అని యేడుబాణంబులు ప్రయోగించి యతనిత్రాణ చెఱిచి యాతనికిఁ దోడుపడ వచ్చిన సుషేణు నేడుబాణంబులను, తారాసుతు వేయినారాచంబులను, సమీరకుమారు నూఱంబకంబులను, గవయు నిన్నూఱుశరంబులను, పనసు నెనుబది యమ్ములను, కుముదుని మున్నూఱు ములుకులను, జాంబవంతు నంబకసహస్రంబునను, గ్రుక్కించి యుక్కును బీరంబు నెక్కొన నేదిక్కునం దానయై కనుపట్టుచుఁ జిత్రప్రచారంబు నడపునక్కుమారవరుని మింట గుంపులుగొని కనుంగొను నిలింపులు మెచ్చుకొని సురభి కుసుమంబులు వర్షించిరి. ఇంతలో పీతాగ్రగణ్యుం డగు కుశుని సమరనైపుణ్యంబు చూడ నేరనినాఁడు తనకు జగచ్చక్షునామంబు తగునే యని పోడ తెంచెనోయన ద్యుమణియుఁ బూర్వశిఖరిశిఖరం బలంకరించెను. అంత దిక్కులతోడన సైనికుల మొగంబులును

దెలివి వహింప భరతుండు కడఁక మీఱ బలంబులం బురి
కొలిపికొని కుశు నెదిరించెను. అది గని లవుం డడ్డంబు సొచ్చి
యాఱుశరంబుల భరతుని శరాసనంబుఁ దునుమ నేసిన నతండు
వే ఱొండు కాండాసనంబు గైకొనక మున్న లవునియన్న
నిశితకాండంబుల నతనిఁ జొక్కిపడ నేసెను. అట్లు భరతుం
డరదంబుపయిం బడుట గనుంగొని హనుమంతుం డంతరంగం
బెంతయు నుడుకఁ గినుక దెచ్చుకొని యొక్కనగంబుఁ బెఱికి
తెచ్చి కుశలవులపై నేసిన వారలద్దానినడుమన చూర్ణంబుచేసి
యా సమీరకుమారు నొక్కయమ్ముననె సొమ్మగొన నేసి
మఱియుఁ బెక్కమ్ములఁ దక్కంగల బలంబు నుక్కడంచిరి.
అంత హతశేషసైనికులు హాహాశం బఱచి శ్రీరాఘవునకు
నంతవృత్తాంతంబుఁ దెలుప నయ్యిలాపతి పలువగల వగచి
ప్లవగాధిపవిభీషణులచేఁ బ్రబోధితుం డై దీక్షవహించి కదలక
యున్నఁ గార్యంబు దప్పు నని తలపోసి తమతమ మూలబలం
బులతోడ విభీషణసుగ్రీవులు కొలిచి రా ననంతవాహినీపరి
వృతుం డై వెడలి గంగాకూలంబుఁ జేర వచ్చి యాచేరువ
రణాంగణంబునం గూలినసోదరులను, ఆమోధ్రిల నాత్మప్రతిబిం
బంబులై వెలుంగొందుడింభకులను, విలోకించి కొంచె
మేనియుఁ గినుక మనంబునం జొనుపక యాబాలకులఁ జేరఁ
బోయి, "ఓ యన్నలారా! మీ రెవరికుమారులరు? మీనా
మంబు లెవ్వి? మీకు జాతకర్మాదిసంస్కారంబు లెల్ల నడపి
ధనుర్విద్యాప్రవీణులుగఁ జేసినవా రెవ్వరు? తెలుపరే" అను

టయు, కుశుండు నగుచు, "వసుమతీశా! యుద్ధంబు సేయ సన్నద్ధుండవై వచ్చినవాఁడవు వచ్చినపని తోలఁగఁ బెట్టి మా పుట్టుపూర్వోత్తరంబులు విచారించె దేల? ఈ మాటలతేటలం బోటుమాని ఘోటంబు విడువఁ బోము. పోరాటకు వెనుదీయువారము కాము. అయినను నీబోఁటివాఁడడుగ నదుత్తరం బియ్య కుండుట యుత్తమవృత్తంబు కాదు. కావున మావృత్తాంతంబు కొంత వివరింతుము చిత్తగింపుము. మే మీకానలో నుండుమునికుమారుల మని మావేషంబులె తెలుపుచున్నవి కదా! మాకు వేదవేదాంతార్థరహస్యంబులును, ధనుర్విద్యాకౌశల్యంబును, సర్వపాపపరిహారకం బగు శ్రీరామాయణ పారాయణంబును, వాల్మీకి మునివరుననుగ్రహంబునం బడయ నయ్యె. జాతకర్మనామకరణాన్నప్రాశనచౌలోపనయనంబు లనియెడు వేదోక్తకర్మంబు లెల్ల నామునివర్యునివలన నడపం బడియె. మమ్ముఁ గన్నతల్లి లోకమాత యగు సీత." అని జానకిపేరు సెప్పుటయు, మానవేంద్రుండు దూయమానమానసుండై చిత్రరుప్రతిమయుంబోలె నిశ్చేష్టితుండై కొంతసేపటికిఁ గళదప్పి రథంబుపయిం బడి పడంపడి యొక్క ముహూర్తంబునకుఁ దెలివొంది లేచి సుగ్రీవునిం జూచి యీకుమారాగ్రగణ్యు లెవ్వరో చక్కఁగాఁ జూచి తెలిసికొనుము. నావుడు సుగ్రీవుండు స్వామీ! వీరిరువురు మహాతేజ బాలపురుషులు. ఉసునాపురుషోత్తమునికుమారులని తోఁచెడిని. పోలిక చూడ మీయపరమూర్తులని యనవలసియున్నది. సందియం బేల? పరికించి

చూచిన వీరు మీకుమారులె. అనునంతలో వానరసేనాపతి యగునలుం డనువాఁ డొక్క శైలంబుఁ బెకల్చికొని వచ్చి కుశలవులపై వైచెను. వారు దాని నించుకేనియు సరకు సేయక యశనిసంకాశంబు లగునిశితశరంబులం బరఁగించి యగ్గిరిఁ జూర్ణంబు గావించి యొక్క దొడ్డనారసంబున వాని మేనుతూఁటువో నేసి నేలం గూల్చిరి. అంత వానిమేననుండి యెన్నిరక్తబిందువులు నేలఁబడియె నన్నిమూర్తు లావిర్భవించి కుశు నాక్రమించెను. ఆ కుమారుం డంతటం జలింపక యంత కాకారుండై యెన్నిసెలాకారంబు లప్పుడు తన్నాక్రమించె నన్నింటికి నన్నిశరంబు లేసి రూపుమాపి తక్కిన వానరదాన వానీకంబునకుం గవిసి నుఱుమాడం జొచ్చెను.

అట్టియెడ రామచంద్రుండు నిస్తంద్రుఁడై భ్రాతృవధవ్యథాజనితక్రోధం బతిరేకం బై పెరరేఁప హాలాహలసదృశంబు లగుక్రూరనారాచంబు లాకుమారుపైఁ బ్రయోగింప నవి కృతఘ్నవిషయంబునం బ్రయుక్తంబు లైనయుపకృతులుం బోలె నతనియెడం బనిసేయ వయ్యె. అది యెఱింగి రాఘవేశ్వరుం డంతరంగంబున విషాదంబు పొంగి విరాగంబు వహించి దురంబు చాలించి కుశప్రయుక్తనిశితాశుగంబుల తాఁకున నిజాంగంబు గాసిల్ల సోలిపడి శతాంగంబె శయనంబుగా శయనించెను.

అంత జానకీనందనులు పరమానందంబున నొండొరులం బ్రశంసించుకొనుచు బ్రతివీరు లెల్లవారు నిహతు లైరి. ఇఁక

మనమిరవు చేరి తల్లి నుల్లసిల్లం జేయుట కార్యంబు. అని రాముని రథం బెక్కి, అమ్మహామహుని నిటునటుం బొరలించి, ఆయన ధరించిన హార కేయూరాది పరిష్కారంబు లెల్ల నూడ్చి కొని, అట్టుల భరతాదుల యాభరణంబులు నొలుచుకొని, మహోల్లాసంబునం జనుచు రొక్కచో నప్రాణులయ్యు గత ప్రాణులవిధంబునం గదలమెదల వెఱచి గుక్కుమిక్కురనక యొదిగి యున్న జాంబవదాంజనేయులం గాంచి, మన కూరక పోనేల? ఈ రాజుల రథంబులు రెండు గైకొని, వాని యం దీవనచరంబులం బెట్టుకొని పోయి, అమ్మకుం గానిక పెట్టుదము. ఆమె వనచరంబులం గన్న బ్రియంబునం జేరం దీయుచుండును. అనుమాటలు విని యాంజనేయుండు జాంబ వంతునితో, "వింటివా వారిమాటలు, మనలం బట్టుకొని పో నాలోచించుచున్నారు. వీరికిం జిక్కక చిక్కులం బెట్టి తొలంగుద మన్నం దొలంగ రాదు. ఇప్పుడు దైవంబు మనకుం బ్రతికూలం బై యున్నయది. లవుండు మూర్ఖుండు, అన్న వలదు పో నిమ్మన్న పోనిచ్చువాండు కాండు. కావున నూరక వీరికిం జిక్కి పోయి చారుచరిత్ర యగు భూపుత్రిం గాంచి సేవించి యాదేవి యనుగ్రహంబుం బ్రాపించి వచ్చుట మేలు" అని యనియె. జాంబవంతుండు నట్లయగుంగాక యని యూరకుండె. కుశలవులును మేరుమందరసంకాశంబులై సరథ్యంబులై కలని కెడగలుగ నిలువరించి యున్న దాశరథుల రథంబుల రెంటిని బరిగ్రహించి, వానియందు వానరాచ్ఛభల్ల

వల్లభులతోడ నిరువురు నారోహించి, జయచిహ్నంబు లెఱుక
పడ శంఖంబులు పూరించుచుఁ దమయాశ్రమంబునకుం జని,
తమకొనిపోయిన మణిభూషలతోడఁబవనతనయ భల్లుకేశ్వరులఁ
దల్లికిం గానుకపెట్టి మ్రొక్కి యుద్ధవృత్తాంతం బాద్యంతంబు
నెఱింగించిరి.

సీత వారలఁ జూచినంతన తన మనంబున వెలుఁగును
వెఱపును జనింపఁ దత్తరించుచు నంతయు విని, "అన్నలారా!
మీ రారఘుకులపుంగవుల సంగరంబునం గెలుచుట కురంగశాబ
కంబులు దృప్తకేసరులం గెలుచుట గాని యొండు గాదు.
ఔరా దైవమహిమ! ఈ మహారణ్యంబున నేరికి నెఱుఁగఁ
బడక యజ్ఞాతవాసంబు చేయుచున్న నాయునికి యీ నిమిత్తం
బున బయలుపడ నయ్యె. అది యటుండ నిమ్ము. మగఁడవ
మానించె నని కొడుకులం బంచి రాఘవుల ననిఁ బడనేయించె
నని లోకులు నన్ను నిందింపుదురే. ఈ యపవాదంబు నెట్లు
దొలఁప వచ్చు. రాఘవేంద్రునిపాటు విని యెట్లు మన వచ్చు.
ఇందుల కేమి సేయవచ్చు" అని పలికి, లవునితో, "అన్నా
వల్మీకసంభవుం డీవార్త విన్న మనల దండింప కున్నె. కొఱగామి
యనక మునివటువుల మాటలు వినక యేల గుఱ్ఱంబుఁ బట్టి
తివి. దానవె కదా యింతపుట్టె. ఇఁకఁ గడచినదానిఁ దడ
వుట గతజలసేతుబంధనంబు. కావున మానధనులగు నీపవ
మానతనయభల్లుకవల్లభుల నెప్పటియట్ల రాఘవుల సేవింపఁ
బో విడుపుము. విడువకున్న మనకుఁ గడు నడలొదవును."

అని హనుమంతుం గనుంగొని, "మునుపు రాము నెడఁబాసి యశోకవనికామధ్యంబున నంగలార్చు చున్న నాయునికి రఘు నాయకునికిఁ దెలిపి పలాదకులంబు నిర్మూలంబు సేయించి నన్ను నాయేలినవానిం గూర్చిన మహోపకారి వగుట యెఱుంగక యీవసిపాపలు నీ కపకారంబు సేసిరి. అది యెగ్గు గాఁ గొనక యలుక డిగ్గ విడచి తొల్లిసంజీవనిఁ గొనివచ్చి తేర్చినట్లు లిప్పుడును రాఘవుల వనచరనిశాచరులతోడ సంజీవి తులంజేసి నా కొదవు నపవాదంబు తొలఁగ ద్రోసి యశం బార్జింపుము నిర్జితప్రతిభటుం డగు జాంబవంతుండును నీకుఁ దోడుపడుం గాక." అని యనునయ పూర్వకంబుగాఁ బలికిన జానకి పలుకులు హనుమంతుం డాదరించి యాల కించి ప్రదక్షిణంబుగా నమస్కరించి వీడ్కొని జాంబవంతుం బురస్కరించుకొని పొలికలని వలనికిఁ జనియెను.

ఇంతలో నట వాల్మీకియు నారదుని వలన నెల్ల వృత్తాంతంబు నెఱింగి యత్యంత సంభ్రమంబున నిజాశ్రమంబు నకు వచ్చి తదీయద్వారదేశంబున మూర్తిమంతంబు లై లోకంబుల హరింపం గడంగు నస్త్రవిద్యలో యన వెలుంగు చున్న కుమారద్వయిం గాంచి, వార లభివందనంబులు సేసి నం దీవించి, "మీకుఁ దొలఁగఁ ద్రోయ రాని పోరాటంబు సంప్రాప్తం బయ్యెనని వింటి. ఎవ్విధంబున నారణార్ణవంబు దాఁటి మంటి రెఱింగింపుఁడు." అనవుడు, కుశుండు హయంబు లవుపిచేఁ బట్టువడుట, బలంబులు లవునాక్రమించుట,

శత్రుఘ్నునిచేఁ లవుండు చిక్కువడుట, అనంతరము తాను దురంబుసేయం బోవుట, లోనుగా రామావనీంద్రుం డాలంబున నీలుగునంతపర్యంతంబు సవిస్తరంబుగా నెఱింగించిన నెఱిఁగి యమ్మునిపుంగవుండు హాహాకారపురస్సరంబుగా రణరంగంబునకు నరిగి మంత్రజలంబు చిలికి రఘువల్లభు కళదెలిపిన అమ్మహనీయుండు తెలివొంది మోహాతమంబుం బాసిన మహాయోగిచెలువున మేఘావరణంబు దొలంగిన మిహిరునిమాడ్కి వెలుంగొందెను. దివ్యదుందుభిధ్వానంబులతోడ ననల్పంబయి వేల్పులచేఁ గురియింపంబడిన పువ్వులవాన విస్తరిల్లెను. అమృతవృష్టి యతిశయిల్లెను. మలయమారుతంబు చల్లనితావులు వెదచల్లెను. భరతలక్ష్మణశత్రుఘ్న సహితంబుగా నరవానరాసురబలంబఖిలంబు నెప్పటియట్ల సప్రాణంబై యుల్లసిల్లుచు లేచి నిలిచెను.

అంత మునినాయకు లనుగమింపం దన్ను దగ్గఱిన వాల్మీకికి, రఘునాయకుం డతి భక్తిం బ్రణమిల్లి బహుమానించి యతండు దీవింపం బ్రీతుండై, "మునివరా! మీయనుగ్రహంబునం బ్రతికితిమి." అనవుడును, వరుణాత్మజుం డిట్లను. "ఏపట్లను కుంభకారఘటనంబునం జేసి ఘటకుంభాదినామంబులచే మృత్తునందు వివిధభేదవ్యవహారంబు కల్పితంబైన విధంబున నీచే నీభువనంబు బహురూపాత్మకంబై తత్తత్కాలానుగుణ్యంబుగఁ గనుపట్టుచుండు. ఇంతియెకాక సర్వాత్మకుండవగునీకు శత్రులన నెవ్వరు? మిత్రులనువా రెవ్వారు? నిన్ను

రాగద్వేషాదులు పొందుట యన నెట్టిది? నీవు సాక్షాద్విష్ణుం డవు. సీత లోకమాత. మీచే నాచరితంబు లగుకృత్యంబు లెల్ల వేదచోదితంబులై యుండు. కొడుకైనవాఁడు బాల్యచాపల్యంబునం జేసి యేదేని దుడు కొనరించినను దండ్రి యది పాటింపక యోర్చు వాటించి యుండుట లోకస్వభావంబె కదా. అదియునుంగాక కొడుకులశూరవ్యాపారంబులు తండ్రులకుఁ బరమాహ్లాదకరంబులై కనుపట్టుచుండును. కావున నీ కుమారులు ని న్నెదిర్చి విక్రమించినందులకు నీ వానందింప వలయు. నీవుపిన్ననాఁడె లోకాపకారిణియైయేపుమీఱిచరించుచున్న తాటకం బొరిగొంటివి. పరశురాముని యేపడంచి వైష్ణవచాపంబుఁ గైకొంటివి. వెండియుఁ దండ్రియానతిపేరఁ బేరడవుల కరిగి యందు మున్నూరు లగుఖరదూషణాదులఁ దునుమాడి, మాయామృగంబై వచ్చిన మాయలమారి మారీచుం దెగ్గొలిచి, జీవలోకద్రోహి యగు యోజనబాహు నాహుతి గొని, సుగ్రీవునితో సఖ్యంబుచేసి, వాలి నొక్కమ్మునం గూలిచి, వలీముఖానలిం బలంబుగాఁ గూర్చుకొనిఁ దక్షిణ సముద్రంబు దఱిసి, దానిదాఁటువెరవు విచారించి, నడవ గట్టించి దాఁటి, లంక నాక్రమించి, సహపుత్రమిత్ర బాంధవంబుగా దివిజశత్రు వగురావణుం జంపి, నిలింపులు గుంపులు గొని వినుతింపం బ్రియపత్నిం బరిగ్రహించి, పుష్పకం బధిరోహించి, అయోధ్యం బ్రాపించి, పట్టాభిరాముఁడ వైతివి. శ్రీరామా! నీవిక్రమాటోపంబు నయిరించి నిలువఁ గాల

కంటుండైనఁ జాలం డన నీబాలకు లేపాటివారు? కొడుకు
లనుమమతచే దుడుకు సైచితివిగాక. నేను వరుణాలయాకుంఠ
నై పాతాళంబునకుఁ బోయినకతంబున నీ బాలకులకు నీకొలంది
తెలియమిని నింత పుట్టె. అయిన నేమాయె, వారనుగ్రహ
ణీయులు నీవనుగ్రాహకుఁడవు. వారు కొడుకులు నీవు తండ్రివి.
నూవులు నూనెయు నొకటె గానిగ వాఁడె వే ఱన్నట్టు, మీర
లన్యోన్య మొక్కటియె కదా! నే నెవ్వఁడ మీకు బోధింప,”
అని మేలంబుమెయిం బలుకుటయు, రామచంద్రుం డాకా
చంద్రుండునుంబోలెఁ బ్రసన్నుండై తిన్ననియెలుంగున “ముని
వరా! మిమ్ముఁ గన్నయంతన మాపను లన్నియుఁ జక్క
నయ్యె. నా చక్కనయ్యల దోడి తెప్పింతురేనిఁ గన్నులారఁ
గాంచి యానందించెద.” అని మందలింప నత్తపసిఱేఁ
డయ్యుత్తరంబు పడయుటకై యంత చదివినవాఁడు గావునఁ
జిత్తంబున సంతసంబు దళుకొత్తఁ దత్క్షణంబ బాణబాణాసన
వీణాపాణు లగుజానకీసూనులం దోడితెప్పించెను. అట్లు వచ్చిన
కుమారు లిరువురును దమజనకునడుగుల కెఱఁగి ఘోరదురిత
నివారణపరాయణం బగు రామాయణంబు నానావిధరాగ
రచనావైశారద్యంబు మెఱయఁ దుంబురునారదులు బోలె
వీణాముఖంబునం బాడిరి. అందులకు రాఘవేంద్రుం డానం
దంబు పొంగార నయ్యనుంగుబిడ్డలం జేరఁ దీసి యాలింగనంబు
సేసికొని సీతావియోగజాతసంతాపంబాఱ, కనుఁదమ్ముల
నానందరసంబు జాలువాఱ, తనయోర నిలుచున్న పిన్నతమ్ము